PRSVMORA 18 3


సాహిత్య ప్రస్థానం

ఆగస్టు 2017

సంపుటి : 16 సంచిక : 8


## మత్తు విపత్తుపై సమరం

తెలుగు రాష్ట్రాల్లో మద్యపాన వ్యాపారంపై మహిళల పోరాటం, మాదక ద్రవ్యాలపై అధికారుల విచారణ చాలా కీలకమైన, అవసరమైన పరిణామాలు. నెల్లూరు జిల్లాకు చెందిన దూబగుంట రోశమ్మ స్ఫూర్తిగా 1990లలో మహిళలు, ప్రజా సైన్సు కార్యకర్తలు ఇతరులు కలిసి సాగించిన సారా వ్యతిరేక పోరాటం గొప్ప ప్రభావం చూపింది. దేశానికే ఉత్తేజమైంది. తదుపరి వచ్చిన ఎన్టీఆర్ ప్రభుత్వం సంపూర్ణ మద్య నిషేదం విధించవలసి వచ్చింది. కాని తర్వాత ఆ పరిస్థితి మారింది. ఇబ్బడిముబ్బడిగా పెరిగిన వైన్‌షాపులు ఉత్తరోత్తరా బెల్టుషాపులుగా విస్తరించాయి. బడి గుడి కూడలి వంటి తేడా లేకుండా జన జీవనం మధ్యలోనే తిష్ట వేసి దుష్టధోరణులకు కారణమైనాయి. ఆరోగ్యాలు నాశనం కావడానికి కుటుంబాలు కుప్పకూలడానికి ప్రమాదాలకు అత్యాచారాలకూ కూడా అత్యధికంగా ఈ తాగుడు వ్యసనమే కారణమని అధ్యయనాలు చెబుతున్నాయి. అయినా ప్రభుత్వాలు కూడా ఈ మద్యపాన దుర్వ్యసనాన్ని ఆదాయ వనరుగా కామధేనువుగా చూస్తూ అంతకంతకూ దుకాణాలను అనుమతించాయి. నైట్‌లైఫ్ గురించి, మాల్స్‌లోనూ మద్యం అమ్మకాల గురించి మాట్లాడుతున్నాయి. హైవేల సమీపంలో ఈ వైన్‌షాపులు వద్దని అత్యున్నత న్యాయస్థానం తీర్పునిస్తే రెండు రాష్ట్ర ప్రభుత్వాలు దాన్నుంచి తప్పించుకునే ఎత్తులు వేశాయి. ఈ పరిస్థితుల్లో మరో సారి ఆంధ్ర ప్రదేశ్‌లో మహిళలు స్వచ్ఛంద సంస్థలు మద్యపాన విజృంభణపై పోరాటం చేపడితే వారిపై పోలీసులు మద్యం మాఫియా దాడి చేయడం దారుణం. ప్రభుత్వం ఆ మహిళల పక్షాన నిలబడి ఈ శక్తులను శిక్షించాలి. హద్దూఆపులేని మద్యం వ్యాపారాన్ని నియంత్రించాలి. ప్రజలకు మరీ ముఖ్యంగా మహిళలకు ఇబ్బంది కలిగించే చోట్ల నుంచి దుకాణాలు ఎత్తివేయాలి. దాన్ని ఆదాయవనరుగా చూసే ధోరణి మారాలి.

ఇక తెలంగాణలో మత్తుపదార్థాలకు బానిసలను చేసే డ్రగ్స్ మాఫియా ఆసుపాసుల కోసం వేట సాగుతున్నది. బడిపిల్లలను కూడా బలితీసుకుంటున్న ఈ మహమ్మారి ముఠాలతో తెలుగు చిత్ర పరిశ్రమలోనూ కొందరు సంబంధం కలిగివున్నారని, హైదరాబాదులో పబ్బులు క్లబ్బులు ఇందుకు నిలయాలవుతున్నాయని వస్తున్న సమాచారం ఆందోళనకరమైంది. ఈ నేపథ్యంలో ప్రస్తుతం సినిమా వారిపై విచారణ జరుగుతుంటే సహజంగానే విపరీతమైన ప్రచారం సాగుతున్నది. వీరేగాక ఇతర ఘరానా శక్తులు వ్యక్తులు ఎవరున్నా పట్టి శిక్షించాలని ప్రజలు కోరుతున్నారు. అటు మద్యం ఇటు మత్తుపదార్థాల సమస్య సమాజానికి సవాలుగా తీసుకుని ఖచ్చితంగా నివారించాల్సిందే. ఈ చర్చలను చర్యలను దారి తప్పించే ప్రయత్నాలు ఎవరు చేసినా మంచిది కాదు. విస్తరిస్తున్న విష సంస్కృతి ఇందుకు మూలమన్న మెళకువతో ఆరోగ్యకరమైన ప్రత్యామ్నాయ ప్రజా సంస్కృతిని పెంపొందించడం కూడా అవసరం.

కవర్ పెయింటింగ్ : అలెగ్జాండర్

బొమ్మలు : తుంబలి శివాజి, గంగాధర్

## ఈ సంచికలో ...




సంపాదకవర్గం

తెలకపల్లి రవి (ప్రధాన సంపాదకుడు)

వొరప్రసాద్ (వర్కింగ్ ఎడిటర్)

కె. సత్యరంజన్ • చీకటి దివాకర్

గనారా • శమంతకమణి

• కెంగార మోహన్

కె.లక్ష్మయ్య, మేనేజర్



మనీ ఆర్డర్లు, రచనలు పంపించవలసిన చిరునామా:

ఎడిటర్, సాహిత్య ప్రస్థానం, ఎం.బి. విజ్ఞానకేంద్రం, డో.నెం. 27-30-4, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నర్‌పేట, విజయవాడ - 520 002, సెల్: 9490099059

హైదరాబాద్ చిరునామా

ఎం.హెచ్‌భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్ ఆర్‌టీసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్ - 500 020

ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

# ఉదయిస్తున్న ప్రశ్నలు

- సిద్దెంకి యాదగిరి
9441244773



మనిషికీ మనసుకీ
అల్లుకుపోయే మేనుబంధం
మెడకోసినా కొద్దీ అతుక్కుంటనే ఉంటది
కులకంపరం రంపమై
మధుకర ప్రేమను
వివక్ష జరాసంధున్ని చేసి రెండుగా చీల్చింది

చరిత్ర మొఖంపైన నిల్సిన
కమిలిన దెబ్బల్ని
అంతరాల కులమౌఢ్య కుడ్యాలను కూల్చేదాకా
బర్రల్ని పొగరు మొలల్ని చేసి
బాధించాలనుకునే మనసుల్ని బ్లాస్టింగ్ చేస్తే...?

పురివిప్పిన పంచముని ప్రేమ పింఛాన్ని
ఉరివెట్టి జీవిదీసిన ఉన్మాదం
అంతరించే వరకు
పీకబడిన కళ్ళకు చూపునిచ్చి
లక్షనక్షత్ర కాంతులతో
శిక్షగా నింగిలో నిలిపితే....?
అంటరానితనాన్ని చెరిపేసిన ఒంటిబంధం
తెగిపడ్డ మర్మాన్ని ఛేదించే క్షిపణి చేసి
తెగువను అద్ది
మొగులుమీద లక్ష్యంకోసం ఎగరేస్తే...?
బంధించబడుతున్న వాస్తవం
పోస్టుమార్టమ్ వాసన గుప్పుమంటూ
దేశపు దేహమ్మీద వ్యాపిస్తున్న దుర్గంధం
చచ్చిన శవం పెచ్చులూడుతూ
విరిగిపోతున్న విలువలకోసం
ఉదయిస్తున్న ప్రశ్నలు
కులాలు వద్దంటూనే కులహత్యలా?
వివక్ష లేదంటూనే మరణ శిక్షలా?
అంతా ఒక్కటని అంతం చేయడమే పంతమా?

వెలివాడ
తేనెటీగల్ని
ఎన్నిసార్లు తెగ్గోసినా
కవ్వించే పుప్పొడి
కుత్తుకల్ని తెగ్గోస్తున్నా
నవ్వుతూ మధువును సేకరిస్తాయి

## జూలై నెల పురస్కారాలు

**ఆమె గళమెత్తింది**
కథకు: రూ.700/-
రచయిత : నల్లపాటి సురేంద్ర

**అరుంధతీయుడు**
కవితకు : రూ .500/-
రచయిత : ఈ. రాఘవేంద్ర

కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారాల చెక్కులు ఈ రచయితలకు అందుతాయి

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు.

- ఎడిటర్

# ఎవరి కోసం ?

- జంధ్యాల రఘుబాబు
9849753598



రోజులాగే అరుణ ఉదయం ఐదున్నరకే లేచింది. అందులోనూ సోమవారం హడావుడి. బ్రష్ చేసుకోవటం మొదలు రాత్రి పడుకునే వరకు పరుగే పరుగు. కాలానికి సంకెళ్ళు వేస్తే మన పనులు తీరిగ్గా చేసుకోవచ్చుననుకుంటుంది. ఇలాంటి ఆలోచనలు చేస్తూ కూచుంటే మన మెదడు, శరీరం పనిచేయటం మానేస్తాయి. మనమే బేడీలు వేసుకున్నట్టవుతుంది. అప్పుడు కాలం నవ్వుకుంటూ చూస్తుంది పరుగాపకుండానే.

అసలు ఈ కాలాన్ని ఎవడు కనిపెట్టాడో కదా! ఐనా తన చాదస్తం, బానిస భావం కాకుంటే కాలాన్ని ఓ ఆడమనిషి కనిపెట్టి ఉండవచ్చుకదా! ఈ పురుషప్రపంచంలో మనిషంటే మగవాడే. వాడికోసమే ఈ వ్యవస్థ మొత్తం పనిచేస్తోంది. ఈ ప్రపంచం వాడికోసమే తయారయింది. వేనోళ్ళ కొలుస్తుంది. అంతెందుకు మామయ్యకు అన్నీ సమకూర్చాకే అత్తయ్య తనగురించి ఆలోచిస్తుంది. తానెందులో తీసుపోయిందామెకి? భర్త శేఖర్కు కూచున్నచోటికే అన్నీ అందించటం లేదా? ఇంకా ఆయనే ఆపని, ఈపని అందుకుంటుంటాడు. ప్రతి దాంట్లోనూ సాయం చేస్తానంటాడు. పిల్లల్ని కూడా అమ్మకు హెల్ప్ చెయ్యొచ్చుకదా అంటుంటాడు. అసలు తనకు అందరూ సహాయం చేయడమేంటి. ఈ పనంతా తనదేనా. ఇంటి పని కదా ఇదంతా! ఇంటిపనిలో అమ్మకు సాయపడు అనొచ్చు కదా. ఈ చాకిరీ డిపార్టుమెంట్లన్నిటికి తానే హెడ్డయినట్టు బాధ్యరాలన్నట్టు మాట్లాడతారెందుకు? ఆ కిరీటాన్ని అత్తయ్య తన తలపై పెట్టింది కాని శేఖర్ తలపై కాదుకదా. ఆమె కూడా తన అత్తగారినుండి ఆ వారసత్వాన్ని స్వీకరించిందే కదా. ఇవన్నీ ఈ జీవితంలో తేలని ప్రశ్నలు అనుకుని వదిలేసింది అరుణ. లేకపోతే ఇంట్లో పని తెమలక ఆలశ్యమైపోయి స్కూలుకు లేటుగా పోతే అక్కడ హెచ్చెమ్తో మాటలు పడాలి. ఇవన్నీ తనకిష్టముండవు.

కాఫీ రెండు గ్లాసుల్లో పోసి అత్త దగ్గరే కూచుంది. ఆ ఐదునిముషాలు ఆ కాఫీ ప్రపంచంలో మునిగారిద్దరూ. రోజంతటిలో ఇదే కొద్దిగా విశ్రాంతి సమయం. పుట్టింట్లో అమ్మతో కలిసి తాగితే ఇక్కడ అత్తయ్యతో. అంతే తేడా, మిగతావన్ని సేమ్ టు సేమ్. ఈ కాఫీ విశ్రాంతికి కేరాఫ్ అడ్రెస్సేమీ కాదు. అది మన మెదడుని, శరీరాన్ని ఇంకో రోజు పని ఎలా చేయాలని, వీలైతే ముందురోజుకంటే ఇంకా బాగా ఎలా చేయాలన్న ఉత్తేజాన్నిస్తుంది. పరిగెత్తే కాలం ఏర్పాటు చేసిందే ఈ కాఫీ అనుకుంటుంది అరుణ. ఆమాట

అత్తయ్యకి చెబితే ఆమె నవ్వి ఊరుకుంది. అది కూడా కొన్ని క్షణాలే , ఎందుకంటే నవ్వటానిక్కూడా సమయముండదు కదా. ఇంకో పావుగంటకు మామయ్య వస్తాడు తన షుగర్ లెస్ కాఫీ కోసం. ఆయన వెనుకే శేఖర్, ఓ పావుగంట తేడాతో. మళ్ళీ రెండో విడత కాఫీకోసం తప్ప ఇద్దరూ కనబడరు మధ్యలో.



పిల్లలిద్దరూ తమ క్యారియర్లో కొత్తగా స్నాక్స్ ఏమైనా చేస్తుందేమోనని అప్పుడప్పుడూ చూసిపోతుంటారు. అమ్మాయి స్వీటి ఎనిమిదో తరగతి, బాబు ఆర?వ్ మూడో తరగతి. వారికి ముందురోజు బేకరీలో శేఖర్ తెచ్చినవే పెట్టిస్తుంది. ఎప్పుడైనా తాను సెలవు పెట్టినప్పుడు ఫ్రెష్‌గా ఏమైనా చేసిస్తుంది.

తన రెండో విడత కాఫీకోసమొచ్చాడు శేఖర్.. చేయి ఖాళీ లేదు, స్టవ్ అంతకన్నా లేదు. వచ్చి మవునంగానే ఎదగమనీ అన్నట్టు నిలబడ్డాడు.

"ఆట చూస్తున్నారా"

"కాదు ఆటకావాలా పాటకావాలా చూస్తున్నా"

"సరే చూడండి"

"కాఫీ"

"చూస్తున్నారుగా! ఒకదానిపైన కుక్కరు, ఇంకోదానిపైన ఉప్మా "

"ఏదో ఒకటి దించొచ్చుగా"

"అప్పుడు ఉడకని అన్నం, ఉండలు ఉండలుగా ఉప్మా, ముందే బొంబాయి రవ, మీకిష్టమైనది"

"వద్దులే...." మరో మాట లేకుండా వెళ్ళిపోయాడు.. అరుణకే పాపమనిపించింది.

ఆరోజు సాయంకాలమే ఫ్లాస్కు తెచ్చాడు శేఖర్. దానివల్ల కొద్దిగా మేలే జరిగింది కాని మామయ్యకు షుగర్‌లెస్ కాబట్టి ఆయనపోసుకుని తాగాక మరో పదినిముషాలకు గ్లాసులో వేసుకుని, చక్కర కలుపుకుని తాగేటప్పటికి చల్లని కాఫీ రెడీ.

ఇక లాభంలేదు ఏదో ఒకటి చేయాలని నిర?యించుకున్నాడు శేఖర్. ఆఫీసులో, మిత్రుల దగ్గర ఇదే విషయం మాట్లాడుతున్నాడు. తమ అధికారి సునీతా మేడం ఓ మంచి సలహా ఇచ్చింది. నాలుగు బర్నర్ల గ్యాస్ స్టవ్ తీసుకొమ్మని. అది తీసుకుంటే ఒంటింట్లో అరుగు కొత్తది కట్టాలని చెప్పింది వీణా మేడం. ఇదంతా ఎందుగ్గాని స్టవ్ చూసొచ్చి అరుగు కొలత పెట్టి చూడమన్నాడు రవి. ఈ ఐడియా నచ్చింది అందరికీ. ఆన్‌లైన్ లో తెప్పించమని రఘునందన్ చెప్పాడు. ఇక ఎవ్వరిమాటలూ వినిపించటంలేదు తనకు.

ఇక ఆ పని మీదే ఉన్నాడు శేఖర్. ఎవ్వరికీ అనుమానం రాకుండా అరుగు చుట్టుకొలతలు తీసుకొని పేపర్‌లో రాసుకున్నాడు. నాలుగు రోజులు లైన్లో నిలబడి అతి కష్టం మీద పదివేలు డ్రా చేసుకున్నాడు. రవిని తీసుకొని సీదా ఆంధ్రా కిచన్‌వేర్‌కు పోయాడు. నాలుగు బర్నర్ల గ్యాస్ స్టవ్, తన జీవితాన్ని మార్చబోతున్న గ్యాస్ స్టవ్‌ను చూసుకొని మురిసిపోయాడు. దాని కొలత చూశాడు. ఇంకా రెండంగుళాలు మిగులుతుంది తమ అరుగుమీద. జేబులోనుండి ఐదు రెండువేల నోట్లు ఫెళ ఫెలలాడుతున్నవి తీశాడు. రవి దాన్ని పట్టుకొని కూర్చున్నాడు. "రేపన్నది మాపన్నది పనికిరాదులే ఓ మారియా" అని ఈల వేసుకుంటూ దూరుకుపోతున్నది బండి. జీవితంలో తాను ఒక బహుమతయితే ఈ కొత్త స్టవ్ రెండోదని శ్రీమతికి చెప్పాలని ఉద్రూతలూగుతున్నాడు. జీవితాన్ని జీవించాలిగాని ఇలాంటి సంతోషాలు ఎన్నో ఉంటాయని మనసులో అనుకున్నాడు. అసలు పెర్సనాలిటీ డెవెలప్‌మెంటు మీద తానే ఓ పుస్తకం రాస్తే పోలా అని తనను తాను ఓ వీరేంద్రనాథ్‌లాగా పట్టాభిరాంలాగా ఊహించుకున్నాడు.

శ్రీమతి స్కూలునుండి వచ్చేలోగా పాత స్టవ్ తీసేసి నాలుగు బర్నర్ల కొత్త స్టవ్ తగిలించాడు. అప్పుడు అమ్మ చూసిన చూపులో ఎన్నో అర్థాలు కొట్టొచ్చినట్టు కనిపించాయి శేఖర్‌కు. అలాంటి చూపే తన తండ్రినీ చూసిందామె, "మీరూ ఉన్నారు భార్యను సుఖపెట్టే ఇలాంటి పని ఏనాడైనా చేశారా?" అన్న అర్థం అందులో గోచరమవుతోంది.

అనుకున్న ప్రకారం ఈ కొత్త గ్యాస్ స్టవ్ గురించి ఎవ్వరూ అరుణకు చెప్పకూడదు, తనంత తానే చూసి ఆశ్చర్యపోవాలి. అనుకున్నట్టే ఆమె వచ్చింది.

"ఏమిటి మీరు ఈసమయానికే ఇల్లు చేరారు" శేఖర్ వైపు చూస్తూ

"ఏమీ లేదు డియర్, కొద్దిగా తల నొప్పి ఉంటే ముందుగా వచ్చేశానంతే"

"ఉండండి కొద్దిగా కాఫీ పెట్టిస్తా..." అని పది నిముషాల్లో స్నానం ముగించి టీచర్ అరుణను మామూలు అరుణగా మార్చేసింది. వచ్చి లైటరుకోసం వెదకసాగింది. అరుగువైపు కన్నెత్తి కూడా చూడలేదు.



"లైటరెవరైనా చూశారా?"

"లేదు..." దాన్ని తీసిపెట్టిన శేఖర్

"సరే అగ్గిపెట్టే శరణ్యం" అనుకొని అరుగువంక తిరిగింది. ఆశ్చర్యం, కొత్త గ్యాస్ స్టవ్! అదీ నాలగు బర్నర్లది !!!

అరుణ మొహం ఒక్కసారి విప్పారింది. శేఖర్ దొంగ తలనొప్పి తెలిసిపోయింది. కిచన్‌లోకొచ్చాడు.

"ఇక మా అరుణకు లైటరుతో అవసరం లేదు. నాబ్ తిప్పగానే బర్నరు వెలుగుతుంది" అని స్టవ్ గురించి డెమో ఇచ్చిన అబ్బాయి మాటలే కాస్త మార్చి చెప్పాడు.

"అబ్బ థ్యాంక్సండి. ప్రాణం లేచొచ్చినట్టుగా ఉంది"

"థ్యాంక్స్ చెప్పాల్సింది ఇప్పుడుకాదు. ఉదయం పనులన్నీ చక చకా అయిపోయినప్పుడు చెప్పాలి"

ఓ వారం ఇంట్లో, వంటింట్లో ఉదయం శాంతి పావురం తన ఇష్టమొచ్చినట్టు తిరిగింది, అదీ నోట రెండు లేత ఆకులుపట్టుకుని మరీ తిరగసాగింది. అత్తయ్యతో అరుణ గడిపే సమయం అదీ పొద్దుటిపూట ఓ పదినిముషాలు పెరిగింది. వాట్స్‌యాప్ లో వచ్చే మెసేజెస్ ఉదయం కూడా చూస్తోంది అరుణ.

నాలగు బర్నర్లతో కుస్తీ పడుతున్న అరుణకు లోపలినుండి మామగారు చక్కెరలేని కాఫీ, అదీ రెండవసారి ఇవ్వమని తియ్యగా అడిగారు.

"ఇస్తున్నాను మామగారు " అని "స్వీటీ ఈ కాఫీ తాతయ్యకివ్వమ్మా" అరిచింది అరుణ.

"స్పెషల్ టీ ఔర్ ఏక్ కప్" పేపర్లోంచే అరిచాడు శేఖర్ హొటల్ బాయ్ ని అనుకరిస్తూ

"అదీ రెడీ తీసుకుపోవచ్చు" అరుణ

ఇంతలో ఆర?వ్ వచ్చాడు "అమ్మా నాకీరోజు గ్రీన్ పీస్ ఫ్రై" అని తన స్నాక్స్ మెనూ చెప్పిపోయాడు

తాతయ్యకు కాఫీ ఇచ్చి స్వీటీ కూడా వచ్చింది "నాకు స్వీట్ కార్న్"

ఇంకో వారానికి ఇలాంటి డైలాగులతోనే ఒక్కొక్కరూ తమకు కావలసిన వాటిని చెప్పిపోతుంటే అరుణ మనసులో ఏదో తట్టింది

"శేఖర్..." అని గట్టిగా అరిచింది

"చెప్పు డియర్ అని టీగానీ మూడోసారి ఇస్తున్నావా" అని తీయగా అడిగాడు

"ఈ కొత్త స్టవ్ ఎవరికోసం తెచ్చావ్?"

"అదేం మాట డియర్? మా ఇంటిదేవత....."

మధ్యలోనే కట్ చేసి

"నిజం అరుణా.... నీకోసమే!!"

"నాకోసమే అంటే నా పనులకోసమేగా?"

"అంతే కదా...!"

"అంటే నా పనులన్నీ మీ సుఖాలకోసమేగా?"

".....?"

"చెప్పు నాకు సమాధానం కావాలి"

"అంటే... అంటే..."

"కంప్యూటర్లు వచ్చాక పనెక్కువయిందని మా ఫ్రెండ్ కాంతి చెబుతుంటే నాకు తమాషాగా అనిపించేది. కానీ ఇప్పుడు తెలిసొచ్చింది ఆ విషయం. మాడ్రన్ టైమ్స్ లో చార్లీ చాప్లిన్‌లా తయారయింది నా పరిస్థితి. కారు విడిభాగం ఒక్కో నట్టూ తిప్పుతున్న చాప్లిన్ గుర్తొస్తున్నాడు. కన్వేయర్ బెల్టు కొద్దిగా స్పీడు తిప్పితే ఆయన ఎక్కువ నట్లు తిప్పాలి, అది చూసి నవ్వుకున్నానే గాని దాని వెనుక యజమాని చేస్తున్న శ్రమ దోపిడి ఎలాగుందో నాకర్థమయిందండీ"

అందరూ వింటున్నారు మవునంగా

"ఈ కొత్త స్టవ్ వచ్చినప్పటినుండీ చూస్తున్నాను. దాన్ని చూపి నాతో ఎక్కువ పని చేయిస్తున్నారందరూ. నిజమే అది నా సుఖం కోసమే. కానీ దాని ముసుగులో మీ సుఖాలు దాగి ఉన్నాయండీ. చెప్పండి అవునో కాదనో ఏదో ఒక మాట చెప్పండి...!" గట్టిగా అరవలేదుగాని అరుణ వేసిన ప్రశ్న భావగరితంగా ఉంది

ఎవ్వరిదగ్గరా అరుణ ప్రశ్నకి సమాధానం లేదు

ఇదంతా చూస్తున్న శాంతి పావురం కళ్ళు చెమ్మగిల్లాయి. ఒకింత ప్రశంసా పూర్వకంగా చూసిందది అరుణ వైపు

# పడగొట్టాలి వేయి పడగల్ని...

- బెండాళం క్రిష్ణారావు
9493043888

చందమామ కథల్లో
పులితోలు కప్పుకున్న
మేక గురించి విన్నాం
కానీ-
ఆవుతోలు కప్పుకున్న
పులులమధ్య బతుకుతున్నాం



నిత్యం కన్పిస్తాయవి
అందరికీ సాధువుల్లానే...
లోపల లోలోతుల్లో మాత్రం
వాటిలో ఘనీభవించిన క్రూరత్వం
రుచిమరిగింది ఏనాడో
సగటు మనిషి రక్తానికి...

వేదవిద్యలు నేర్చినందుకు
శంబూకుని తలని రాముడు
తెగ నరికాడంటే అది
కథలోనే అనుకున్నాం...
ఏ విద్యనీ నేర్పకుండానే
శబరుడైన ఏకలవ్యుని
బొటనవేలుని గురుదక్షిణగా
తెగ్గోయించిన ద్రోణుడి కథ
కల్పనేమో అనుకున్నాం...

ఆదిమకాలం లోని
అమానుషత్వాన్ని వారు
ఆధునికయుగం లోకి
వారసత్వంగా తెచ్చుకున్నారని
గ్రహించలేకపోయాం...

మా శ్రమజీవుల స్వేదం
ఎన్ని స్వప్నాలని సాకారం చేసినా
శాస్త్ర విజ్ఞానంతో ముందుకు
అడుగేయాలని చూస్తున్నా, దానిని
తమ పెట్టుబడుల పిడికిట్లో పెట్టుకుని

సమాజం సమానత్వం వైపు
నడవకుండా కట్టేస్తున్నారు
అడుగడుగునా మౌఢ్యపు కుడ్యాలు

అందుకే బతుకు పోరులో
అనునిత్యం అలసిపోతున్నాం
గొంతెండిన ఆవేదనా స్వరాలతో
ప్రతిక్షణం మిగిలిపోతున్నాం
వివక్షల ఉప్పెనల ధాటికి
మునిగి తేలుతున్నాం
జీవన్మరణాల మధ్య ...

జనంలోనే కాదు ఇప్పుడు
పాలకుల అధికారపీఠాలపై
తిష్టవేసింది ఆ రాక్షసత్వం
వేయిపడగల 'మను' సర్పమై...
మనుషుల నరనరాల్లో
ప్రవహించే రుధిరంలో
ఎయిడ్స్ క్రిమిలా చొరబడి
కులం కుటిలత్వాన్ని
అణువణువునా వెదజల్లుతూ...

బాబాసాహెబ్ చూపిన దారిని
ఎంచుకున్న జనంపైనే
కక్కుతోంది అది
తన 'కుల'కూట విషాన్ని
ప్రతిపల్లెలోనూ సెగలు రాజేస్తూ
పగలు ఎగదోస్తూ
వెలివాడల కుత్తుకలపై
వివక్షల విచ్చుకత్తిగా మారుతూ
అగిరిపల్లైనా, గరగపర్రైనా
ఒకటే కథ తరతరాల వ్యథ

పైపై పోరాటాలు ఏనాటికీ తాకలేవు
వివక్షతా విషసర్పం బుసలను కూడా...
ఈ దేశం నలుదిశల్లో పరుచుకున్న
విశాల సమాజం నుంచి
పీడిత ప్రజలంతా సమూహమై కదలాలి...
ఉక్కుపిడికిళ్లతో ఉమ్మడిఉద్యమాన్ని నిర్మించాలి
మనిషితనంపైనే పగబట్టిన
వేయిపడగలను పడగొట్టాలి

# ఐదు హంసలు
## రూప వైవిధ్యమే మిగిల్చే పోస్టు మోడ్రనిస్టు ప్రయోగం



డా॥ వి. చంద్రశేఖర రావు
14.04.1959 - 08.07.2017



- జిలుకర శ్రీనివాస్

ఈ నవల మీద జరగాల్సినంత చర్చ జరగలేదు. దీనికి చాలా కారణాలు ఉన్నాయి. కొంతమంది ఈ నవల అర్థం కాలేదన్నారు. కొంతమంది ఇది తిరోగమన నవల (నాన్-ప్రోగ్రెస్సివ్) అన్నారు. ఏమైనా దీన్ని అర్థం చేసుకోవటం క్లిష్టతరమైంది కనకనే పాఠకులు, విమర్శకులు సరైన స్పందన చూపలేకపోయారు.

తెలుగు నవలా ప్రక్రియలో ప్రయోగాలు అరుదుగానే కన్పిస్తాయి. కవిత్వంలో చేసినన్ని ప్రయోగాలు నవలా రచనలో రచయితలు చేయలేదనిపిస్తుంది. వస్తువును సులభంగానూ, ఆనందదాయకం గానూ అందించే ప్రయత్నమే జరిగింది. కందుకూరి నుంచి ఓల్గా వరకు. వస్తువు మారింది. ప్రపంచీకరణ తర్వాత పరిస్థితి ఇంకా మారింది. అయితే పాశ్చాత్య సాహిత్యంలో పోస్ట్‌మోడ్రనిజం వేసిన ప్రభావం ఏమీ తక్కువ కాదు. పోస్టుమోడ్రనిజం సృష్టించిన తాత్త్విక గందరగోళం తెలుగు సాహిత్యాన్ని కూడా తాకింది. అయితే, తెలుగు పోస్ట్‌మోడ్రనిస్టు రచయితలు చాలా తొందరగానే ఆ గందరగోళం నుంచి బయటపడినట్టు కన్పిస్తుంది. దానికి కారణం తెలుగు గడ్డమీద జరిగిన, జరుగుతున్న ప్రజాస్వామిక మార్క్సిస్టు పోరాటాలు, కమ్యూనిస్టు సైద్ధాంతిక భావజాల సాంస్కృతిక వారసత్వమేనని చెప్పవచ్చు. పోస్టుమోడ్రనిజం ప్రవచించిన కొన్ని మంచి అంశాల్ని పోస్టుమోడ్రనిస్టులు తెలుగు సాహిత్యానికి అందచేశారన్నది కూడా నిజం. దళిత, స్త్రీ, మైనారిటీ తదితర సమూహాల పోరాటాలు చారిత్రక అవసరంగా వచ్చాయి. ప్రాగ్మటిక్ పాలిటిక్స్ (పోస్టు స్ట్రక్చరలిజం/పోస్టు మోడ్రనిజం) తర్వాత ఏం జరుగుతుందన్నదే నేటి పాశ్చాత్య మేధావుల పరిశోధనగా సాగుతున్నది.

పోస్టుమోడ్రనిజం ఇక ఎంతమాత్రమూ సరిపోదని సియాటిల్ నుంచి బషీర్‌బాగ్ వరకు జరిగిన పోరాటాలు ఆచరణాత్మకంగా నిరూపించాయి. దళిత, స్త్రీ, మైనారిటీ, ప్రాంతీయ తదితర వాదాలన్నీ ప్రపంచీకరణ, మతతత్త్వానికి వ్యతిరేకంగా ఉమ్మడిపోరాట ప్రతిపాదనల్ని ముందుకు తెస్తున్నాయి.

పోస్టుమోడ్రన్ జీవితాన్ని చిత్రించే నెపంతో 'నేనూ-చీకటి', 'ఐదుహంసలు' నవలలు వచ్చాయి. 'ఐదు హంసలు' ఆటా వారి పోటీలో రు.50 వేల బహుమతి పొందింది. అయితే ఈ నవల మీద జరగాల్సినంత చర్చ జరగలేదు. దీనికి చాలా కారణాలు ఉన్నాయి. కొంతమంది ఈ నవల అర్థం కాలేదన్నారు. కొంతమంది ఇది తిరోగమన నవల (నాన్-ప్రోగ్రెస్సివ్) అన్నారు. ఏమైనా దీన్ని అర్థం చేసుకోవటం క్లిష్టతరమైంది కనకనే పాఠకులు, విమర్శకులు సరైన స్పందన చూపలేకపోయారు. "ఆధునిక కవిత్వం అర్థం కావాలంటే ఆధునిక జీవితం అర్థం కావాల"ని శ్రీశ్రీ చెప్పారు కదా! అలాగే పోస్టుమోడ్రన్ రచనలు అర్థం కావాలంటే కూడా పోస్టుమోడ్రన్ జీవితం తెల్సుండాలి. అయితే అలాంటి పోస్టుమోడ్రన్ జీవితం మన సమాజంలో

కన్పిస్తుందా? అని ప్రశ్నిస్తే ఉందనే చెప్తారు. 'మెట్రోపాలిటన్, కాస్మోపాలిటన్ నగరాల్లో కన్పిస్తుంది' అంటారు. ఆ నగర జీవితాన్ని ప్రతిబింబించేదే ఐదు హంసలు. అయితే రచయిత డా॥ వి. చంద్రశేఖరరావు దళిత, స్త్రీవాదుల పోరాటాలే ఆధునికానంతర వాస్తవ పోరాటాలుగా, చారిత్రక అవసరాలుగా చిత్రించారు. నవల ఆసాంతం స్త్రీల, దళితుల జీవితాల్లో జరిగిన అన్యాయాలను, వారికితోడుగా మార్క్సిస్టుల పాత్రని 'మాజికల్ రియలిజం' అనే ఫాంలో సృజించారు.

ఇక్కడ మాజికల్ రియలిజం గురించి కొంత చెప్పుకోవాలి. 'మాజికల్ రియలిజం' ఒక రచనా ప్రక్రియ. ఇది 1920లో లాటిన్ అమెరికాలోని ఫైన్ ఆర్ట్స్ (school of painters)లో వచ్చింది. 1940లో ఈ మాటని క్యూబన్ నవలాకారుడు అలిజ్ కార్పెన్టైర్ మొదటిసారిగా సాహిత్యంలో ప్రయోగించాడు. లాటిన్ అమెరికన్ రచయితలు ఫాంటసీ, మైథాలజీని వాస్తవిక సాహిత్యం (realistic fiction)తో కల్పి సృజిస్తున్న ధోరణిని ఆయన గుర్తించాడు. ఈ ధోరణిని చెప్పడానికి ఆయన వాడిన మాట "మార్వలెస్ రియాలిటీ" (to real marvillos- లాటిన్లో, Marvellus reality). ఈ ప్రక్రియని విస్తృతంగా ప్రచారంలోకి తెచ్చినవాడు గాబ్రియెల్ గార్షియా మార్క్వెజ్. మార్క్వెజ్ సాహిత్యంలో చేసిన సేవకు 1982లో 'నోబెల్ ప్రైజ్' వచ్చింది. ఈయన 'వన్ హండ్రెడియర్స్ సాలిట్యూడ్' (1967) అనే నవలకు ప్రపంచ వ్యాపిత గుర్తింపు వచ్చింది. ఇదే 'మాజికల్ రియలిజం'కు విస్తృతవ్యాప్తిని తెచ్చిపెట్టింది.

M.H. Abrram మాజికల్ రియలిజాన్నిలా తెల్పుతాడు: "These writers interweave in an ever-shifting pattern, a sharply etched realism in representing ordinary events and descriptive details together with fantastic and dream like elements, as well as with meterials derived from myth and fairy tales" (A glossary of literary terms, 1993)

అబ్రం ప్రకారం మాజికల్ రియలిజంలో చెప్పే విధానం ఎప్పుడూ మారుతుంటుంది. విపరీత భావన, అసంబద్ధత, కలలు కల్సిన సాధారణ అంశాలు, వివరణాత్మక సంఘటనలు వాస్తవంగా చిత్రించబడ్తాయి. అదే విధంగా అభూత కల్పిత కథలు, కాల్పనికత నుండి తీసుకున్న అంశాలు ఉంటాయి.

జాసన్ కాలంటానిమో ప్రకారం "Not fantasy, science or horror, magical realism is a distinctive Genre that typically presents charectors that live in two worlds: every day reality and the world of the charactor's own dreams and superstitions" (Magical realism outside of Latin America.)

విలక్షణమైన పాత్ర లుంటాయి. అవి రోజువారి వాస్తవ జీవితంలో, వాటిపైన కలల ప్రపంచంలోనూ అంధవిశ్వాసాల్లోనూ జీవిస్తూ ఉంటాయి.

ఈ ప్రక్రియలో జార్జి లూయిస్ బోర్గ్స్ అర్జెంటైనాలో, మార్క్వెజ్ కొలంబియాలో, గుంటర్ గ్రాస్ జర్మనీలో, జాన్ పౌల్స్ ఇంగ్లాండ్‌లో– ఇంకా అనేకమంది ప్రపంచ వ్యాపితంగా రచనలు చేశారు. తెలుగులో వి. చంద్రశేఖరరావు 'ఐదు హంసలు', మునిపల్లెరాజు 'మాజికల్ రియలిజం కథలు' వచ్చాయి.

ఈ ఫాంలో వచ్చిన రచనను అర్థం చేసుకోవటం కొంచెం కష్టమే! మార్క్వెజ్ 'వన్ హండ్రెడ్ ఇయర్స్ సాలిట్యూడ్' నవలలో పాత్రలకు రెక్కలు మొలవటం, గాలిలో ఎగిరి ఎక్కడెక్కడో విహరించటం, వివిధ జీవులతో సంభాషించటం ఉంటాయి. విచిత్రమైన, భయంకరమైన కలలు ఆయన రచనలో కన్పిస్తాయి.

'ఐదు హంసలు'లో కూడా ఈ విధమైన అంశాలు కన్పిస్తాయి. ఒకచోట చంద్రశేఖరరావు నిరంజన్ పాత్రతో అనిపిస్తాడు– "అయినా మార్క్వెజ్‌కో, బోర్హెస్‌కో, మరో ఎక్స్‌కో, మరో వైకో పారడీలు ఎందుకు సృష్టించాలి! నేను నిరంజన్‌ను... మనం..." ఈ నవల చాలా చోట్ల మార్క్వెజ్‌ను అనుసరించినట్టుగా కన్పిస్తుంది. 'నాలుగో హంస' కథ నుంచి కొంచెం తన పంథా మార్చుకున్నట్టు కన్పిస్తుంది. నవలను అర్థం చేసుకోవడానికి పాఠకుడు ముందుగా 'ఐదోహంస'కథను చదవాలి. అప్పుడే సులభంగా అర్థమవుతుంది. లేకపోతే నిరంతరం రూపాంతరం చెందే పాత్రలు అసంబద్ధంగా తోస్తాయి. అసంపూర్తిగా తొలగిపోయే పేరాలు, అంతర్ధానం అయ్యే పాత్రలు, మనస్సునిండా బీభత్సాన్ని నింపే అబ్సర్డ్ వర్ణనలు మనల్ని చికాకుపరుస్తాయి. కాని ప్రతీ హంస ఒక జీవితానికి మెటాఫర్. ఈ విధానమే నవలను ఫజిల్‌గానూ, మిరాకిల్‌గానూ మార్చింది.

నవలలో నిరంజన్, సత్యప్రకాశం, లలిత, తీర్థముఖి,

**మనస్సునిండా బీభత్సాన్ని నింపే అబ్సర్డ్ వర్ణనలు మనల్ని చికాకుపరుస్తాయి. కాని ప్రతీ హంస ఒక జీవితానికి మెటాఫర్. ఈ విధానమే నవలను ఫజిల్‌గానూ, మిరాకిల్‌గానూ మార్చింది.**

మోహనసుందరం ప్రధానపాత్రలు. హైదరాబాద్ నగరం నవలకు కేంద్రం. నిరంజన్ సత్యప్రకాశం, లలితల ఇంట్లో ఉండి నవల రాస్తుంటాడు. నిజ జీవితంలోని వ్యక్తుల్నే వివిధ పేర్లతో పాత్రలుగా మలుస్తుంటాడు. 'ఐదు హంసలు' పేరుతో ఒక్కో హంసగా ఐదు కథలు చెప్తాడు. వీటన్నిటిలో నిరంజన్ కామన్ క్యారెక్టర్. మిగతా కథల్లో స్త్రీ పాత్రలు, పురుష పాత్రలు మారుతుంటాయి.

> **ఈ నవల కమ్యూనిస్టుల్ని గుర్తిస్తూనే, వారిని విమర్శించేదిగా కన్పిస్తుంటుంది.**

'మొదటి హంస' కథలో నిరంజన్, కోమలి డ్రీం ఫాక్టరీ (నాటకాల్లో)లో పన్చేస్తుంటారు. మోహనసుందరం, ఆనందశంకరం మరో రెండు పాత్రలు. మోహన సుందరం ఈ కథలో ఆదర్శవాది. నాటకం రవీంద్రభారతిలో ప్రదర్శిస్తూంటే, ప్రేక్షకులు ఆనందోత్సాహంలో నాటకం మధ్యలో అతన్ని రోడ్డుమీదికి ఊరేగింపుగా తీసుకురావటం, పోలీసులు అతణ్ణి అరెస్టు చేయటం జరుగుతాయి. యాక్సిడెంటులో కోమలి కాలు విరిగిపోతుంది. కొయ్యకాలుతో నడుస్తుంటుంది. తన ఫ్లాష్ బాక్ చెప్తుంది. తన భర్త వేరే వివాహం చేసుకున్నది చెప్తుంది. నిరంజన్‌కు ఆమె మీద కోర్కె కల్గుతుంది. ఒక రాత్రి సమాధుల మధ్య తనతో సమాగమించమని, తల్లి కావాలని ఉందని చెప్తుంది. అలా వారి ప్రణయంవల్ల ఒక వికృత శిశువును కంటుంది. నుదురుమీద ఒంటి కన్ను ఉన్న శిశువును వదిలి కోమలి ఎటో వెళ్ళిపోతుంది. ఒంటికన్ను కుర్రాణ్ణి బాలభగవంతునిగా ఆనందశంకరం ప్రచారం చేస్తాడు. కోమలికి తనకు కలిగిన వికృత శిశువుతో ఆనందశంకరం ఏదో చేస్తాడని నిరంజన్ ఊహిస్తాడు. ఆనందశంకరానికి మహిమలంటే ఎక్కువ ఇష్టం. డబ్బు సంపాదనకు ఆ అబ్బాయిని ఉపయోగిస్తాడు.

'రెండోహంస కథ'లో మాలతి తన జ్ఞాపకాల్ని రాసుకుంటుంది. దళితుల మీద జరిగిన దాడులకు, దళితుల చైతన్యానికి మాలతి ఒక మెటాఫర్. మాలతి, మోర్మియో మాష్టారు, మోహనసుందరం, వెన్నెలక్క, నిరంజన్ పాత్రలు ప్రధానమైనవి. మాలతి దళితయువతి, కాలేజీవిద్యార్థి - మోహనసుందరం అదృశ్యమాంత్రికుడు - నిరంజన్ బ్రహ్మణకులంలో పుట్టినా కుల వ్యతిరేక చైతన్యం కల్గిన వ్యక్తి. మాలతి మోహనసుందరం ప్రభావంతో 'ఉక్కు హంస'గా మారుతుంది. మాలతి తూనీగలతోటి, చిలకలతోటి చిన్నప్పుడు మాట్లాడుతుంది. అవి జరగబోయే ప్రమాదాన్ని ముందే ఊహిస్తాయి. రోడ్డు రోలర్ మాలతి కాలు మీద నుండి పోయి నుజ్జునుజ్జు అవుతుంది. అప్పటి నుండి 12 ఏళ్లు మాలతి నిద్రపోదు. వెన్నెలక్క నక్సలైట్. ఆమె పాటతో మాలతి నిద్రపోతుంది. కథ చివర నిరంజన్ చేస్తున్న సర్కస్ చూడ్డానికి వచ్చిన వెన్నెలక్కను పోలీసులు కాల్చి చంపుతారు. మోహన సుందరం వెన్నెలక్క మృతికి జోహార్లర్పిస్తూ ప్రదర్శన తీస్తాడు. ప్రదర్శన నుంచి తప్పుకుంటే నీకు చావు మూడుతుందని చెప్పినా ఫ్రెండ్స్ బలవంతంపై నిరంజన్ మందుపార్టీకి వెళ్తాడు. తిరిగి వస్తుంటే పోలీసులు కాల్చి చంపుతారు.

'మూడో' కథలో నిరంజన్ సైబర్‌సర్కస్‌లో పోస్టు మోడర్న్ మార్ఫ్‌ను కలుసుకుంటాడు. పి.ఎం. మార్ఫ్ మిరాకిల్‌బాయ్‌గా ప్రచారం పొందుతాడు. ఆధునికానంతర యువతకు పి.ఎం. మార్ఫ్ ఒక ప్రతీక. ఆధునికానంతర వాదాల గురించి, కంప్యూటర్ టెక్నాలజీ గురించి అనర్గళంగా మాట్లాడ్తాడు. ఆ తర్వాత మోహన సుందరంను కల్సుకుంటాడు. మోహిని, మోహన సుందరాన్ని నిరంజన్‌కు పరిచయం చేస్తుంది. మోహిని ప్రకాశ్ భార్య. ప్రకాశ్ గిరిజనులకు పాఠాలు చెప్పినందుకు పోలీసులు 'డిటైన్' చేస్తారు. మోహిని, నిరంజన్ సెక్స్ పార్ట్నర్స్‌గా జీవిస్తుంటారు. మోహన సుందరానికి దళిత ఉద్యమాలపై, జాతుల, కులాల, సాంస్కృతిక ఉద్యమాలపై ఎక్కువ నమ్మకం. మోహన సుందరం నివసించే ఇంటిని ఎవరో పేల్చటంతో చనిపోతాడు. ఆ శిథిలాల మధ్య నిరంజన్ తిరుగుతూ జ్ఞాపకాలు నెమరువేసుకుంటాడు. కథ అయిపోతుంది. నిరంజన్ పి.ఎం మార్ఫ్‌ను, లలితను ఫ్రెండ్స్‌ను చేస్తాడు, తర్వాత కథకు ప్రారంభసూచనగా. మార్ఫ్ తాను మిరాకిల్ బాయ్‌ను కాదని నమ్ముతుంటాడు. ఆనందశంకరం ప్రపంచాన్ని మోసం చేస్తున్నాడనుకుంటాడు. ఇదీ అసంపూర్తిగా, అసంబద్ధంగానే ముగించి, నాల్గోకథను చెప్తాడు.

నాల్గో కథలో 'మల్లిక' ఒక దళిత యువతి. ప్రేమవివాహం చేసుకుంటుంది. సరిపడక నాన్నమ్మ మాటతో విడాకు లిచ్చేస్తుంది. ఫెమినిస్టు పాఠాలు ఆమె దగ్గరే నేర్చుకుంది. పట్నంలో చదివినపుడు మోహన సుందరంతో పరిచయం అవుతుంది. భూమికోసం పోరాడి తన తాత, తండ్రి మరణిస్తారు. తల్లి సూరమ్మకు శివయ్యకు లైంగిక సంబంధమున్న విషయం మల్లికకు తెలిసి, అతణ్ణి ఇంటికి రానీదు. శివయ్య మల్లికపై అత్యాచారయత్నం చేసి అరెస్టవుతాడు. పోలీసుల చేత తన్నులు తిన్న శివయ్య అక్కసుతో

మల్లిక నిద్రిస్తున్నప్పుడు కాలు నరికేస్తాడు. మల్లిక కొయ్యకాలుతో నడుస్తుంది. రిజర్వేషన్‌వల్ల గ్రామ సర్పంచ్‌గా ఎన్నికయి అభివృద్ధి ప్రచారం చేస్తుంది. బిబిసి, ఇతర మీడియా ఆమెకు మంచి పేరు తెచ్చిపెడ్తాయి. ఎమ్మెల్యేగా పోటీ చేయాలనుకున్నప్పుడు అగ్రకులాలు మాదిగ పల్లెమీద దాడి చేసి చాలా మందిని హతమార్చుతారు. మల్లిక కూడా కన్పించకుండాపోతుంది. ఈ న్యూస్ కవరేజికి నిరంజన్ వస్తాడు. మోహన సుందరం కన్పించి "మల్లిక చనిపోలేదు! మరో కొత్త జీవితంలోకి వెళ్ళిపోయింది. మల్లిక గురించి చింతించవద్దు. రెక్కల హంస! ఎగరటం అనే విద్య తెలిసింది" అంటాడు ఆశావహంగా.

**దళిత, స్త్రీవాద ఉద్యమాలు విడివిడి స్రవంతులైనా విస్తృతం, నిర్మాణయుతంగా పాలకవర్గాలపై కార్మికవర్గం చేస్తున్న ప్రధాన పోరాటంలో కలవక తప్పని చారిత్రక సందర్భం ఇది.**

'ఐదోహంస కథ'లో నిరంజన్ రాసిన కథనే తీర్థముఖి, సత్యప్రకాశం, లలిత, నిరంజన్‌లు నాటకంగా వేస్తారు. న్యూమిలీనియం సందర్భంగా ఏర్పాటు చేసిన స్టాళ్ళను చూస్తారు. ఆనంద శంకరం టాంక్‌బండ్‌మీద పి.ఎం. మార్క్స్ చేత మహిమలు చేయిస్తానని వేదికపై నుంచి చెప్తాడు. లలిత స్టేజీ మీదకు వచ్చి, నేనూ మిరాకిల్ చేయగలనని, తన తెగిన కాలుకి అమర్చిన కృత్రిమ అవయవాన్ని తొలగించి నడుస్తుంది. హంసలు అరుచుకుంటూ వచ్చి లలితను మోసుకొని గాలిలోకి ఎగురుతాయి. జనం చప్పట్లు కొడ్తారు. ఆ తర్వాత మోహన సుందరం పాత్ర వేదిక ఎక్కాలి. అయితే మోహన సుందరాన్ని పోలీసులు చంపారని అనుకుంటాడు. నాటక సమయానికి వస్తాడని లలిత చెప్తుంది. అన్నట్టుగానే మోహన సుందరం వస్తాడు. మోహన సుందరం మోసుకొస్తున్న విగ్రహంలో ఆదివాసిని, దళితుణ్ణి, పోరాటయోధుని చూసి, "అవును అతనే కొత్త మిలీనియం మానవుడు" అనుకుంటాడు నిరంజన్. ఇంకా ఇలా అరుస్తాడు: "మోహన సుందరం మన మిత్రుడు, మన నాయకుడు, మన పోరాటం, మన క్రీస్తు, మన మార్క్స్! రండి అతణ్ణి స్వాగతిద్దాం."

దీంతో ఐదు హంసలు నవల ముగుస్తుంది. ఈ నవల కమ్యూనిస్టుల్ని గుర్తిస్తూనే, వారిని విమర్శించేదిగా కన్పిస్తుంటుంది. నవల ఉద్దేశాన్ని 'ఐదోహంస' కథలో ఇలా చెప్తాడు: "ఆదియందు ఉద్యమ ముండెను. ఉద్యమం రక్తమాంసాల మనిషిగా రూపాంతరం చెంది, మన మధ్యన నివసించటం మొదలుపెట్టెను. ఆ మనిషి లేదా ఉద్యమం పేరు మోహనసుందరం. గడిచిన శతాబ్దానికి సర్వమూ, భావ ప్రకటనా అతనే అంటారు. అతని జీవితం ఒక రహస్య సంకేతంలానో, యుద్ధగానంతోనో, క్లిష్టమైన సామాజిక సిద్ధాంతం (ఉదా. మార్క్సిజం) లాగా ఉండేది. అతని చుట్టూ కమ్మిన పొరల్ని తొలగించడమే ఈ నాటకం ముఖ్య ఉద్దేశం."(232)

హంసల గురించి చెప్తూ "అవును, హంసల గురించి కూడా చెప్పుకోవాలి. ఇవి ప్రధానంగా పోస్టుమోడ్రన్ అంశాలు. చాలా యేళ్లు గాయపడి, రెక్కలు విరిచేయబడి, ఇప్పుడే రెక్కలు మొలుస్తున్న సందర్భం. వేలాది హంసలకు ప్రతినిధిగా ఈ హంస - మోహనసుందరం గురించి సాక్ష్యం చెబుతుంది." (232)

హంసల పేర్లు చెబుతూ "ఇవాళ లలిత, నిన్న మోహిని, అంతకుముందు కోమలి, ఇంకెప్పుడో మల్లిక, మాలతి వగైరా."(232)

దళిత, స్త్రీవాదాల్ని ఆధునికానంతరవాద ఉద్యమాలుగా పరిగణించడాన్ని తీవ్రంగా వ్యతిరేకించినవాళ్లు, ఈ నవలలో ఆ పోరాటాల్ని ఆధునికానంతర పోరాటాలుగా చిత్రించడాన్ని అంగీకరించకపోవచ్చు. నిరంజన్, లలిత, సత్యప్రకాశంలు మార్క్సిస్టు అయిన మోహన సుందరం కోసం చూసినట్టే ఈ రోజు దళిత, స్త్రీవాదులు ప్రపంచీకరణకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు చేస్తున్న పోరాటం వైపు చూస్తున్నారు. ఈ నవలా రచయితకిష్టం లేకున్నా లలిత, నిరంజన్, తీర్థముఖి, సత్యప్రకాశ్‌లను మార్క్సువాది అయిన మోహనసుందరంతో జత చేశాడు. దళిత, స్త్రీవాద ఉద్యమాలు విడివిడి స్రవంతులైనా విస్తృతం, నిర్మాణయుతంగా పాలకవర్గాలపై కార్మికవర్గం చేస్తున్న ప్రధాన పోరాటంలో కలవక తప్పని చారిత్రక సందర్భం ఇది. డా॥ వి. చంద్రశేఖరరావు నవల ఎలా రాయాలో, ఎలా ప్రయోగాలు చేయవచ్చో తెల్సినవాడు. మాజికల్ రియలిజాన్ని మన సాహిత్యంలో కలిపే ప్రయత్నం చేశారు. అందరికీ అర్థమయ్యేట్టు రాయటం అవసరం. అది నిబంధనగా మారి అభివ్యక్తికి సంకెలగా మారకూడదు. సాహిత్యంలో చేసే ప్రయోగానికి ప్రయోజనం ఉండాలి. ప్రయోజనం లేని ప్రయోగం వృధా ప్రయత్నం అవుతుంది. చంద్రశేఖరరావు చేసిన ప్రయోగం నవలా శిల్పం, రూపంలో కొత్తదనాన్ని తెచ్చింది. ఒక కొత్త ఫాం (form) తెలుగు సాహిత్యానికి పరిచయం చేశారు.

**(సాహిత్య ప్రస్థానం అక్టోబర్-డిసెంబర్ 2002 సంచిక నుండి)**

## అవిరామంలో...

- పాయల మురళీకృష్ణ
9441026977

అంతపెద్దగుంపులో
నడుస్తున్న రెండు పాదాలు
ఎంత కళాత్మకంగా
ఒంటరితనాన్ని చేరదీసాయో
ఎవరికి తెలియదు

నడుస్తూ నడుస్తూ
ఒకవాకిలి దగ్గర
ఓరగా చూపుల్ని ఎందుకు వదిలేసాయో
కొందరికైతే తెలుసు

తెరుచుకోబడే కిటికీ రెక్కశబ్దం లాంటి
ఉదయాన్నే ముఖమ్మీద చిలకరించబడ్డ
ముత్యపు చుక్కల పరిచయం లాంటి
ఆ స్పర్శ..
చిట్టచివరి రాత్రి వెలుగు..
తొట్టతొలి ఉదయపు చీకటి..



పాదముద్రలపై బుసకొట్టే చూపులు
కంటకాల నాలుకల్ని బయటకి తీసాయి
ప్రశాంత వదనం మీద
మెల్లమెల్లగా చెరిగిపోతున్న చిరునవ్వు
తన్యతను శ్వాసించడం మొదలుపెట్టింది

ఏటికివతల
ఉమ్మెత్తపువ్వు క్రింద
జ్ఞాపకం మిగిలిపోయింది
చంపావతి నింపాదిగా నడుస్తోంది..
పాదాలు తెగిపడ్డా యుద్ధం విరమించని
వీరుడిలా...

---

## సాగర కేళి

- దామెర వెంకటరావు.
9701805597

అనంతార్ణవంలోని అలలు
అదేపనిగా అర్థంలేని రొద-
ఏం సాధిద్దామనో ఈ సాగర ఘోష!
ఎవరికర్థం అవుతుందా భాష!

సైకతాధరాలమీద ముహుర్ ముహుర్
ముఖతాడనాల ముచ్చటలెందుకో-
ఉత్తుంగ తరంగాల ఉధృతి ఆగదు-
భంగ పడినా క్షణ భంగురం కాని ఆట!

కిమ్మనక, పొమ్మన్నా ధరణిపై పొరలుదామన్న
తగని తాపత్రయం-వగల త్రపామయం-
ఉరుకుల పరుగుల ఫలితం
నురుగుల తరగల చలితం!

అవని చేలాంచలా న్నందు కోవాలని
ఎందుకా తగని తపన?
పసుప్పచ్చని పావడనికూడా
పచ్చిగా తడిపేస్తే, నొచ్చుకోదా!



నిశిలోని నీలాకాశపు అందం
నీలో కూడా ఉందిసుమా-
నువ్వెరువిచ్చిన పట్టు మేల్ముసుగులో
నివ్వెర గొలుపుతోంది తారాలోకం!

కార్మొయిలై ముసుగు మార్మోగితే
కంట తడి బెట్టిన తారకల శోకధారలు-
ముచ్చట తీరితే చాలు ముఖం చాటేస్తావు
కడలీ! నీలో బడబానలం ఉంది నిజమేసుమా!

కన్నెర్ర చేయకు-సునామీలు సృష్టించకు-
ఐనా-కన్నీళ్ళ ఉప్పన నీకేమూల గనక!
ఎంత అగాధమో నీగుండె లోతు-
అంతులేని ప్రశాంతత,అవధులు దాటాక-
నీ కేళీవిలాసాల నిత్యదర్శనం
మాకో మోళీకాదు-విశ్వరూప సందర్శనం!

# సౌభాగ్య కవిత్వంలో పదచిత్రాలు

- డా॥ వి.ఆర్.రాసాని
9848443610



*పద చిత్రాలు Wordsworth చెప్పినట్లుగా Primary imaginations, secondary imaginations వల్లా రూపం తీసుకుంటాయి. ఇవి ఏ కవిత్వానికైనా సహజంగా వర్తించే కవితాసూత్రాలు. పొందికయిన పదాలతో ఏ చిత్రలేఖకుని కుంచెతోనో చిత్రించిన అందమైన రంగుల బొమ్మల్లా కవిత్వం రూపంలో బొమ్మకట్టించడమే పద చిత్రాలంటే (Figures of words) ఈ పదచిత్రాలు నేటి ఆధునిక కవిత్వంలో ప్రకృతి పరంగానే గాకుండా సామాజిక పరంగానూ వుంటాయి. చాలామంది కవులు ప్రకృతిని సామాజిక అంశాలను మిలితం చేసి రాసిన పద చిత్రాలూ వుంటాయి. అలాంటివారిలో సౌభాగ్య కూడా ఒకరు.*

**FIGURES OF WORDS IN SOUBHAGYA'S POETRY**

కనిపించకుండా వినిపించేది కవిత్వం అంటారు కొందరు. కవి ఏకాంతంగా ఎక్కడో ఊహల్లో తేలిపోతూ భూనభోంతరాల వరకు విహరిస్తూ, ఆ ఊహలతో పలు పద చిత్రాలను పెయింటింగ్ చేస్తాడు. అవే భావచిత్రాలు, బతుకు చిత్రాలు కూడా ఆ పద చిత్రాలు అతని ఊహా ప్రపంచంలోని అందమైన అనుభూతుల కవితా మూలికలుగా మారి కళామతల్లి కంఠాన్ని అలంకరిస్తాయి. ఇవన్నీ కవి ఊహల ద్వారా కవిత్వంలోకి పరావర్తనం చెందిన ప్రకృతికి ప్రతిబింబాలే. అందుకే అరిస్టాటిల్ లాంటివారు 'ప్రకృతి అనుకరణమే కవిత్వం' అన్నారు. ఒక సందర్భంలో **Addison and Lessing "Artistic imagination is more pleasant the more it resembles nature, but at the Same time nature is more pleasant the more it. Resembles art –as when clouds or veins of marbles display the shade of trees or other objects (Literary criticism- A short History – p-255) .**

కవి ఊహాజనిత పద చిత్రాలు రంగుల్నీనుతుంటాయి. ఒక చక్కటి రంగుల చిత్రంలా వుంటాయి. వాటిలో కవియొక్క ఊహాశక్తి ఎలాంటిదో వ్యక్తమవుతుంటుంది. అందుకే మెకాలే **Poetry is brief is a combination of painting and insanity"** అంటాడు.

ఇలాంటి పద చిత్రాలు **Wordsworth** చెప్పినట్లుగా **Primary imaginations, secondary imaginations** వల్లా రూపం తీసుకుంటాయి. ఇవి ఏ కవిత్వానికైనా సహజంగా వర్తించే కవితాసూత్రాలు. పొందికయిన పదాలతో ఏ చిత్రలేఖకుని కుంచెతోనో చిత్రించిన అందమైన రంగుల బొమ్మల్లా కవిత్వం రూపంలో బొమ్మకట్టించడమే పద చిత్రాలంటే **(Figures of words)** ఈ పదచిత్రాలు నేటి ఆధునిక కవిత్వంలో ప్రకృతి పరంగానే గాకుండా సామాజిక పరంగానూ వుంటాయి. చాలామంది కవులు ప్రకృతిని సామాజిక అంశాలను మిలితం చేసి రాసిన పద చిత్రాలూ వుంటాయి. అలాంటివారిలో సౌభాగ్య కూడా ఒకరు.

వీరు ముద్రించిన సంధ్యా భీభత్సం, కృత్యాద్యవస్త, సింహావలోకనం పునరుత్తానం, ప్రేమ కవితలు అన్న ఐదు కవితా సంపుటాలు వున్నాయి. 'సౌభాగ్య' అనేది అతని అసలు పేరు కాదు, కలం పేరు అది వారి శ్రీమతి పేరును తన కలం పేరుగా మార్చుకుని కవిత్వం రాయడం భార్యపట్ల వారికున్న

ప్రేమానురాగాలను వ్యక్తం చేస్తుంది. అతని అసలు పేరు విజయకుమార్.

నవమాసాలు మోసి, శిశువుకు జన్మనిచ్చేముందు స్త్రీ ఎంతటి బాధను అనుభవిస్తుందో ఒక కవిత్వం లేదా రచన వెలువరించేముందు కవి మేధో సంబంధమైన అలాంటి బాధనే అనుభవిస్తాడు. అదే కృత్యాద్యవస్థ.

*జననానికి ముందు/ జగత్తు స్తంభిస్తుంది/ప్రసవానికి ముందు/ప్రాణం రెపరెపలాడుతుంది/వురుములూ మెరుపులూ ఆకాశం చీల్చందే/చినుకు చిన్నారులు నేలమీద వాలరు/గింజను చీల్చుకొచ్చిన మొలకలో/గింజుకున్న ప్రాణం/పువ్వుగా విచ్చుకున్నప్పుడు గానీ పులకరించదు*

సౌభాగ్య గారి కవిత్వంలో కనిపించే పద చిత్రాలు **(Figures of words)**ను 1) ఊహ ప్రధానమైనవి **(Imaginary thoughts)** 2. శ్రమజీవులకు సంబంధించినవి 3. జీవితానికి సంబంధించినవి 4. విద్యకు సంబంధించినవి 5. ప్రపంచీకరణకు సంబంధించినవి అని అయిదు రకాలు వివరించవచ్చు.

**ఊహ ప్రధాన పదచిత్రాలు :** ఈ రకం పద చిత్రాలలో ప్రకృతి వర్ణన మిళితమై వుంటుంది. ఉదాహరణకు సాయం సంధ్యను వర్ణించిన పద చిత్రం ఒకటి చూద్దాం.

*గొంతు తెగిన సూరీడు/ఘోరంగా రక్తం కక్కుకొని/కొండ కింద సమాధి ఐపోయాడు/పుట్టిన చంద్రుడు/పురిట్లోనే చచ్చినట్లు/ఎర్రగా వికృతంగా/నిశీధి నీలిమలో పైకి లేచాడు/ చుక్కలు బిక్కు బిక్కు మంటూ/ఎక్కిళ్ళు పెడుతున్నాయి* (నగరంపై నీడ)

అలాగే సముద్రాన్ని ఒక తల్లిగా ఊహించి చెప్పిన పద చిత్రం మనల్ని ఊహల్లోకి నడిపిస్తుంది.

*పారదర్శక ప్రపంచాండంలో*
*ప్రాణస్పందన సముద్రం*
*కన్నే శరీరమైన భూగోళంలో*
*కదిలే కనుపాప సముద్రం*

................

*తాను నీరవుతుంది*
*కరిగి కన్నీరై కంపిస్తుంది*
*యుగ యుగాలుగా మరణించిన*
*అసంఖ్యాక ప్రాణికోటి ఆర్తనాదాల్ని*
*నదుల ద్వారా తన గుండెల్లోకి లాక్కుని*
*సామూహిక కరాళ బృందగానాన్ని*
*ఆలపిస్తుంది సముద్రం* (తల్లి సముద్రం)

ఈ ప్రపంచాన్ని ఒక అండంగా, భూగోళాన్ని కన్నుగా, సముద్రాన్ని అందులో కదలాడే కనుపాపగా ఊహించడం ఒక అద్భుతమైన **Imagination.**

సూర్యుణ్ణి ఒక వేడి వస్తువులా, చంద్రున్ని ఒక బంతిలా, మేఘాలను పొగగా, సముద్రాన్ని ఆరేసిన చీరలా ఊహించిన పదచిత్రం మనసుపై ముద్రలేస్తుంది.

*మన పూర్వాశ్రమంలో*
*ఒకడు వేడి భరించలేక సూర్యుణ్ణి పడమటికి విసిరేస్తే*
*ఇంకొకడు చంద్రుణ్ణిబంతిలా నింగిలోకి తన్నేస్తే*
*వేరొకడు కొండల వెనక్కెళ్ళి మేఘాల పొగ రగిల్చితే*
*మరొకడు సంచుల్తో నక్షత్రాలు తీసుకెళ్ళి శూన్యంలో కుమ్మరిస్తే*
*ఒకడు సముద్రాన్ని చీరలా ఆరేసి గాలిని కాపలా పెడితే*
*ఆకాశం గొడుక్కింద*
*ఆనందం వెంట పరుగెట్టేవాళ్ళం.* (మిత్రులకు బహిరంగలేఖ)

ఒక సరోవరాన్ని మోసుకుని' అన్న కవితలోను గొప్ప **imginary figure of words** ఎలాంటిదో చూడండి.

"నాలుగు పర్వతాలు నాటి, ఆకాశానికో అందమైన బొట్టుపెట్టి

గుప్పెడు పిట్టల్ని చల్లి నేనో సజీవ చిత్రాన్ని తయారు చేస్తున్నాను

దృశ్యాన్ని నాలుకతో నాకేసి, నాకేసి క్రూరంగా చూస్తున్న పులినుంచీ నన్నెవరు రక్షిస్తారు".

పై కవితా భాగంలో నాలుగు పర్వతాలను నాటడం, గుప్పెడు పిట్టల్ని ఆకాశంలో చల్లడం వంటి ఊహాపదాలతో కవి ప్రకృతి చిత్రాన్ని నిర్మిస్తే, దృశ్యాల్ని నాకేసే పులి వంటి మాటలతో మనసును ఎక్కడికో లాక్కుపోతాడు.

ఇలా ప్రకృతి ప్రేమికుడైన సౌభాగ్య తన పద చిత్రాల ద్వారా ప్రకృతిని అద్భుతంగా ఆవిష్కరించాడు. ప్రకృతిని ఇంత అద్భుతంగా చిత్రించడం ఎలా సాధ్యమో **Addisan & Routhedge** లు ఇలా చెబుతారు.

**Art improkes on nature, thought at the same time it cannot complete with nature. Artiste imitation is the more pleasant if it contains a touch of emotion. (Literary criticism – A short History – P. 255)**

**శ్రమజీవులకు సంబంధించిన పద చిత్రాలు :** తమ శ్రమపైన ఆధారపడి జీవించే కష్టజీవుల గురించిన పదచిత్రాలను సైతం సౌభాగ్య కవిత్వంలో చూడగలం

నిజమైన శ్రామికుడికి కులం, మతం, ఆర్థిక స్థాయీ అంతరాలూ అవసరం లేదు. వాళ్ళని స్వేచ్ఛగా కష్టపడనీయాలి. వాళ్ళ శ్రమలోనే లోక సంతోషం, సుఖం దాగివుంది.

**దయచేసి దయ చూపకండి / వెలివేసి జాలి చూపకండి,**
**మనుష్యుల మధ్య అంతరాలని, అజన్మ వైరాన్ని**
**వెయ్యిరెట్లు పెంచే విషబిందువుల వియ్యంకులివి**
**మమ్మల్ని కష్టపడనీయండి**
**.........................**
**కుల రక్త సంబంధాల పేరు చెప్పి**
**బానిస బతుక్కిలాగే బంధువులారా**
**.............**
**శ్రమించనివ్వండి**
**జీవచ్ఛవాలని చెయ్యకండి.** (దయచేసి దయ చూపకండి)

చిత్తు కాగితాలు యేరి, అమ్ముకొని బతికే శ్రమజీవిని 'చిత్తుకాగితాలవాడు' లో కవి ఎలా భావ చిత్రాలలో బంధిస్తాడో చూడండి.

**"వర్ణనతీతమైన భావార్ణవాలని బంధిస్తావు**
**కాగితాల మీద వాడిపోయిన కలల్ని**
**కట్టగట్టి మోసుకుపోతావు**
**కంపించే మలిన బాష్ప బిందువులా కదలిపోతావు**
**తెల్లవారి తేలిక సంచితో ఒరిగిపోతావు**
**అన్నా ! నిన్నని నిమజ్జనం చేస్తున్న**
**నీ గోనె సంచి జ్ఞాన సంచితానికి విలువ ఎలా కట్టేది"**

కవి దృష్టిలో భిక్షమెత్తి జీవించే వారి శ్రమ ఒక దీక్షలాంటిది. వారు ఎంతో కష్టపడి భిక్షమడిగేటప్పుడు ఎన్నో అవమానాలు, వినరాని మాటలు, ఆకలి కడుపులు, నేలపైన పవళించడాలు ఎన్ని ఎదురయినా ఏ కోపతాపాలు లేకుండా, ఏ వ్యామోహాలు లేకుండా సన్యాసుల్లా బతుకుతుంటారు. వీరే నిజమైన సర్వసంగపరిత్యాగులు, రుషులు, ఈ విషయాన్ని చెప్పేదే 'రుషుల' కవిత అందులో ఒక పద చిత్రం.

**మౌనాన్ని కప్పుకుని**
**మందహాసాన్ని మహారణ్యాల్లో వొదిలేసి**
**శిథిల వస్త్రాలతో, జీర్ణ దేహాలతో**
**అచేతనంగా అద్భుతమైన ఆధునిక ప్రపంచం వేపు చూస్తూ**
**తపస్సు చేస్తూ రుషులున్నారు**
**ఫుట్‌పాత్‌ల ప్రక్కన, హోటళ్ళముందు, గుళ్ళముందు**
**రుషులున్నారు.**
**ఆడ రుషులు, మగ రుషులు**
**పెద్ద రుషులు, పిల్ల రుషులు,**
**వాళ్ళకి కనిపించే మనుషులంతా కలలో దేవతలే**
**వాళ్ళు కళ్ళు తెరుచుకుని, ఒక చేతిని చాచి**
**'అమ్మా! అయ్యా!' అంటూ**
**ఆ పని మంత్రోచ్చాటన చేస్తూ**
**జనారణ్యంలో జపం చేస్తారు.**

భిక్షగాళ్ళకు సంబంధించిన ఇంత గొప్ప ఊహ, ఆవేదనతో కూడిన ఇంత గొప్ప పద చిత్రాలు మరొకచోట కనిపించవనుకుంటాను.

**జీవితానికి సంబంధించిన పద చిత్రాలు : -** మనిషి నేటి ఆధునికయుగంలో అనేకచోట్ల నిరాశతోను మరికొన్ని చోట్ల ఆశలతోను జీవిస్తుంటాడు. నేటిమనిషి జీవితం ఆశానిరాశల వంతెన మీది ప్రయాణం. నిరంతరం బతుకు యుద్ధం చేస్తూనే వుంటాడు.

నీరసమైన ఈ ప్రపంచం నుంచీ నిస్తేజ పరిసరాలనుంచీ నిప్పుల కిరీటాన్ని ధరించి ఉగ్రమూర్తులు, సాహసికులు జన్మించి జగతిని ఉద్ధరిస్తారన్న ఆశను వ్యక్తం చేస్తాడు. 'కాలజ్ఞానం' కవితలో సౌభాగ్య...

**నీరసమైన ప్రపంచం నుండి/ నిస్తేజమైన పరిసరాల్ని నుంచీ/ నిప్పుల కిరీటాలు ధరించి/ ఉత్సాహ గీతాలు పాడే ఉగ్రమూర్తులు పుడతారు/స్వార్థం చేతులుని సాంకేతిక విజయాల మధ్య/ అస్తిత్వాన్ని కోల్పోతున్న మాటకు, మనసుకు/ స్వేచ్ఛను కలిగించే సహసికులు జన్మిస్తారు/ .../ పెరుగుతున్న ఇనుప గోడల్ని కలిగించే/ అగ్ని శిశువులు ఆవిర్భవిస్తారు/ అల్లకల్లోల అరాచక సమాజం నుంచీ/ పైపై మెరుగులకు మైమరిచిపోని/ పట్టుదల మూర్తీభవించిన వాళ్ళు ప్రభవిస్తారు/ అణుబాంబులు అందాలలోంచీ/తెల్లని రెక్కలతో/చల్లని నవ్వుల్తో/శాంతిదూతలు ఉల్లాసంగా లేస్తారు**

ప్రతి మనిషి జీవితం ఆశల దొంతరలను పేర్చుకుంటుంది. కానీ ఆశలదొంతరలు కూలినప్పుడు నిరాశలో మునిగిపోవడం కూడా సహజమే కదా. 'గాయాల ప్రతినిధులు' కవితలో నిరాశవాదాన్ని పద చిత్రాలుగా నిర్మించాడు సౌభాగ్య.

విరిగిన నా రెక్కల ముందు విలపించడం నా దినచర్య

కన్నీటి హారాలు పట్టుకున్న విషాద కన్యల స్వయంవరంలో వరుణ్ణి నేనొకణ్ణే. నన్నొక హేండ్ కర్చీఫ్ చేసి కళ్ళు తుడుచుకుంటే మలిన భాష్పాలతో బరువెక్కుతా

*నన్నొక గొడుగులా విప్పితే నల్లని నీడనవుతాను*
*నేను పెంచుకున్న కుక్కపిల్ల నన్ను కరుస్తూనే వుంది*

*ఈ ఆకాశం ఎలుకల బోనులో*

*భూగోళం మాంస ఖండానికి ఆకర్షింపబడ్డ అసహాయ మూషికాన్ని"*

"అమ్మా కొమ్మ విరిగిందే' అన్న గేయంలో ఒక నిరాశాజీవి కఠిన నిర్ణయాలని, నిర్వేదాన్ని చిత్రించిన పదచిత్రం అద్భుతంగా అనిపిస్తుంది.

*"భూమిలో ఇంకిన నా కన్నీటి బిందువుల్ని ఏరుకుని*

*నా సొంత సముద్రాన్ని సృష్టించుకొని అందులో మునిగి చచ్చిపోతాను*

*పులుల్తో కలిసి ఈ నగర సంచారం చెయ్యలేను*

*అమ్మా ! రా ఆకాశంలోంచీ రా ! భూమిని చీల్చుకుని రా!*

*నిద్రలేని నా స్వప్నాల్ని చల్లని నీ ఎదకు హత్తుకో*

*వొచ్చే జన్మలో ఓ తల్లినై పుడతాను*

*ఓ లేత జీవన నౌక సునాయాసంగా సాగే క్షీర సముద్రాన్నవుతాను"*

ఈ పద చిత్రంలో స్వాప్నికుడైన కవి అమ్మతనాన్ని గొప్పగా చిత్రించడమూ వుంది.

సౌభాగ్య రాయలసీమ మనిషి. రాయలసీమవాసిగా ఇక్కడి దుస్థితిని చెప్పడం కూడా తన బాధ్యతగా భావించిన కవిత్వమూ ఒకటుంది. నిరంతరం కరువు కాటకాలతో మగ్గిపోతున్న సీమ చిత్రం ఆ కవితలో చెప్పినరీతి ఆలోచనాత్మకంగా వుంటుంది.

*మంచులోనూ/ మలమల మాడ్చే/ చండ ప్రచండ ఎండలోనూ/ మౌనంగా నిల్చున్న ఈ రాళ్ళగుట్టల/ సహనానికి సహవాసాలు/ ఆకాశం కాకి ఒక్కోరాయినీ విసిరి/ నీళ్ళన్నీ తాగి నిక్కి నిలుచుంది నీలంగా/..../ కృతయుగం నాటి రాక్షసులు తిని మిగిల్చిన/ బంగాళాదుంపలు/ గండ భేరుండ బ్రహ్మాండ అండాలు/ ఈ బండలు/ .........../ కడప జిల్లా చేతి బాంబులకు ఇవి బృహద్రూపాలు/ గుట్టలు ! గుట్టలు!/ నీటికోసం తపస్సు చేస్తూ/ నిలువెల్లా భూమిలో కూరుకుపోయిన/ అజ్ఞాత రుషుల జడల సుడులు/ ఈ బండ బల్లుల గుడులు (రాళ్ళసీమ)*

**విద్యకు సంబంధించిన పద చిత్రాలు :** విద్య మనిషిని మనిషిగా తీర్చే పరికరం, విద్య మనసును కమ్మిన బూజును దులిపే చీపురు. మరి ఆ విద్యంతా పుస్తకాలతోనే నిక్షిప్తమై వుంటుంది. 'ఈ పుస్తకాలు' అన్న కవితలో మచ్చుకు ఈ పద చిత్రం చూడండి

*"కాలాల ప్రతినిధులైన కవులలో శాస్త్రజ్ఞులో*

*కళావేత్తలో చరిత్రకారులో మేధావులో*

*అనుభవాల్ని ఆలోచనల్ని పుస్తకాల్లో నిక్షిప్తీకరించి*

*లోకాన్ని వెలిగించి భౌతిక నిష్క్రమణ చేస్తారు.*

...............

*ఈ పుస్తకాలు అమృత బాష్ప బిందువులు*

*స్మృతుల్ని చైతన్యవంతంగా చూపించే అద్భుత దర్పణాలు*

*ఆకాశాన్ని చూడడానికి అక్షరాలతో కట్టిన సోపానాలు*

విజ్ఞానాకాశాన్ని చేరుకోవాలంటే అక్షరాలు ఇటుకలతో కట్టిన పుస్తకాల మెటికలే గదా మార్గం.

**ప్రపంచీకరణ ప్రభావాన్ని చిత్రించిన పద చిత్రాలు :** ప్రపంచంలో పరిణామాలనేవి ఎప్పుడూ జరుగుతూనే వుంటాయి. ఈ మార్పు మనదేశంలో 1991 నుంచీ వేగాన్ని పుంజుకుంది. దానికి కారణం **L.P.G. L.P.G.** లో **'L' Liberalisation, 'P' Privatisation 'G' Globalisation.** ఈ మూడింటినీ కలిపి ఈ రోజు 'ప్రపంచీకరణ **(Globalisation)** అనే పేరుతోనే పిలుస్తున్నారు. దీనివల్ల సమాచార రంగంలోను, సాంకేతిక రంగంలోను ఎన్నో మార్పులు వచ్చి ప్రపంచం ఒక 'విలేజ్' అయిపోయింది ఈ **Globe global villages** గా మారే క్రమంలో మానవజీవితంపైన అది విపరీతమైన నష్టాలని, బాధల్ని కూడా నెట్టింది. ఈ ప్రపంచీకరణ పిశాచి పదఘట్టనల్లో ఎన్నో ప్రాదేశిక సంస్కృతులు, జీవితాలు ఛిద్రమై పోసాగాయి. రోజు రోజుకీ మానవసంబంధాలు దారుణంగా తయారవుతున్నాయి. మరి ఈ ప్రపంచీకరణ ప్రభావంతో రాయబడిన పదచిత్రాలెలా సౌభాగ్య కలం నుంచీ రూపుదాల్చాయో కొన్ని ఉదాహరణల ద్వారా చూద్దాము.

ఈ ప్రపంచీకరణ వల్ల మనుషులకు వస్తు వ్యామోహం పెరిగి ధనదాహం ఎక్కువయింది. వాణిజ్య మనస్తత్వం అణువణువులోను జీర్ణించుకుపోతోంది. కాస్త కాసులున్న ప్రతివాడూ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వ్యాపారిగా మారిపోతున్నాడు. అదెలాగో ఈ క్రింది పద చిత్రాన్ని పరిశీలించండి.

*అతను పూలను చూస్తాడు/ ఎడారి దేశాలకు ఎగుమతి చేస్తే/ ఎలా వుంటుందో ఆలోచిస్తాడు./ ఆకాశంకేసి చూస్తాడు/ నక్షత్రాల్ని నాణాలకింద చెలామణి చేద్దామనుకుంటాడు/ శూన్యం కేసి చూపు సారిస్తాడు./ అంతరిక్షంలో అంతస్థులు కట్టి అద్దె కిద్దామనుకుంటాడు/ వానలో తడుస్తాడు/ నేలలో ఇంకేనీటిని/ బిందువుకు వందచొప్పున అమ్మితేనా అనుకుంటాడు/...... / కల కల లాడుతూనే వ్యాపారకళల్ని ప్రదర్శిస్తాడు/ సున్నితంగా చూస్తాడు/ చూపుల్తో రక్తాన్నీ*

# వాళ్ళు

- కావేరిపాకం రవిశేఖర్
9849388182

వాళ్ళు అక్షరాన్ని మట్టిలో తొక్కి
రూపాయి చెట్లు మొలిపించేస్తారు.
మనసుకు వేలం వేసి
ప్రాణాలకు ఖరీదు కట్టి బేరాలాడుతారు.
మత్తులో జోగుతూ,కిర్రెక్కించే శబ్దాల హోరులో
నిజం మరచి గంతులు వేయిస్తుంటారు.
విరిగిన ఎముకల పెళపెళలను
గ్లాసుల గలగలల్లో కలిపేస్తారు.
మరిగిన నెత్తురు, చిందిన స్వేదాలను
సారా చుక్కల్లోకి విసిరేస్తారు.



సీరియల్ సర్పాలు కక్కే విషాగ్ని జ్వాలల్లోకి
కుటుంబాలను నెట్టేస్తారు.
కులం కాటుతో కళామతల్లిని సైతం
కళవళపెడతారు.
ఔను..... నవ నాగరికత ముసుగులో
అంతా భలే మంచి చౌక బేరమే.

---

**జుర్రుతాడు/ ప్రతివాణ్ణీ గౌరవిస్తాడు, కానీ వీలయితే/ ప్రపంచాన్నే పరలోక వాసులకు అమ్మాలనే/ పథకాలు వేస్తాడు** (వ్యాపారి)

మనిషికి స్వార్థం, ధనాశ ఎంతగా పెరిగిపోయిందో పై పదచిత్రంలో వ్యక్తం చేస్తాడు సౌభాగ్య, మనిషికి మనిషిపైన గాకుండా డబ్బుపైన ఎంతటి ప్రేమ పెరిగిపోయిందో దీనివల్ల తెలుస్తుంది. చివరికి మనిషికి ఆకలి తీర్చేది, శ్వాసగా మారేది, ప్రాణంగా మారిపోయిందీ డబ్బే. మనుషులమధ్య వున్న మమకారాలు, ప్రేమలు, పెళ్ళిళ్ళు అన్నీ డబ్బులుగానే మారిపోయాయి. 'అందుకే పెళ్ళిళ్లు మనుషుల రూపంలో జరిగినా నిజానికి డబ్బును డబ్బే వెళ్ళాడుతుంది. ఈ ప్రపంచీకరణ మనిషినే డబ్బుగా మార్చేసింది.

**"డబ్బు డబ్బును ఢంకా భజాయించి ప్రేమించింది/ డబ్బు ప్రేమను డబ్బు అంగీకరిస్తుంది/ చివరికి,/ డ్రమ్స్ దిమ్మతిరిగేలా మోగుతుంటే/ డబ్బుకు డబ్బుకు పెళ్ళయిందా"** (గానుగెద్దు బతుకుల్లో) ఈనాటి పెండ్లిండ్లన్నీ అంతేగదా మరి.

ఈ ప్రపంచీకరణ రాకాసి అమెరికా మానసిక పుత్రిక. అమెరికాకి ప్రపంచమే ఒక మార్కెట్. ప్రతి విషయంలోను చాలామంది అమెరికాను అనుకరిస్తూ వుంటారు మన దేశస్తులయినా అంతే. అది ఎంత వరకు దారి తీసిందో అనుకరణ కవితలో ఒక పద చిత్రం ద్వారా చక్కగా చెబుతాడు కవి

**ఆదర్శాలు లేవు/ అడుగడుగునా అనుకరణలే/ అమెరికాలో మొరిగిన కుక్కని/ ఇండియాలో కుక్క 'ఇమిటేట్' చేస్తుందా/ అనుకరణలే ఆదర్శాలవుతాయి/ ధనం చెట్టు పెరగడానికి ఇంధనం 'అనుకరణ'/ 'స్వేచ్ఛావిపణి'లో స్వచ్ఛమైన రక్తాన్ని పీల్చడానికి**

జీవితాల్లోకి గుచ్చిన 'ట్రాన్స్పరెంటెడ్ స్ట్రా' 'అనుకరణ'. సాంకేతికం పెరిగే కొద్దీ మానవ జీవితంలో వేగం పెరిగిపోతుంటుంది. సాంకేతిక పరిజ్ఞానాన్నీ, తన కంటి చూపుగా మార్చుకున్న ప్రపంచీకరణ వల్ల ఆ వేగం అంతులేని స్థాయికి చేరిపోతుంది. ఆరేండ్ల పిల్లలు కాన్నుంచీ అరవై ఏండ్ల వృద్ధుల వరకూ ముఖపుస్తకం (Face book) వాట్సప్, ట్విట్టర్ వంటి సామాజిక మాధ్యమాల, అంతర్జాల మాయాజాలంలు ఊహించని వేగాన్ని విపరీతంగా పెంచేస్తున్నాయి. ఈ వేగం ప్రవాహాన్ని అడ్డుకోవడం దాని దారి మళ్ళించడం ఎవరికి వీలవుతుంది. 'ఫాస్ట్' కవితలోని పద చిత్రాల్లో ఆ వేగాన్ని చాలా ఫాస్ట్‌గా చిత్రీకరించారు సౌభాగ్య.

**"ఈ ప్రవాహానికి ఎదురీదడానికి పర్వతాలు కావాలి**
**ఈ ప్రవాహాన్ని దారి మళ్ళించడానికి దమ్ములు కావాలి**
**వేగంలో పుట్టే వికారాలకి తట్టుకు నిలబడాలి**
**ఎదిరించడానికయితే ఎన్ని కష్టాలు**
**అడుగుతీసి అడుగు వెయ్యడానికి అంతులేని ఆటంకాలు**
**వేగానికి ఆలోచన వుండదు**
**వ్యాపారానికి వివేచనవుండదు".**

ఇవి సౌభాగ్య కవిత్వంలోని కొన్ని ముఖ్యమైన పదచిత్రాలు. ఈ పద చిత్రాలలో ఈనాటి సమాజం, మనుషులబాధలు అన్నీ అద్భుతమైన ఊహా సౌందర్యంతో సంక్షిప్తం చేయడం జరిగింది.

కవిత

# ఆ శిల్పం పరిమళిస్తుంది

- డా॥ కత్తి పద్మారావు
9849741695

నిశ్శబ్దంలో ఓ గీతం ఉంది
నిశ్శబ్దం ఒక పుస్తకం
నిశ్శబ్దం ఓ అంతరంగిక చలనం
నిశ్శబ్దం ఓ సంగీత ధుని
అవును! ఆ ముంగురులు
కన్నుల్లో ఉండే వెలుగులకు తెరలు వేస్తున్నాయి
కళ్ళు కూడా 'నవ్వుకుంటాయ'ని
పెదవులకు తెలియదు
కనురెప్పలు ఎన్నో కావ్యాలు రాస్తాయి
కన్నులు మూసినప్పుడు
మనస్సు ఆకాశపుటంచులను తాకి వస్తుంది
ఊహలు పేకమేడలవుతాయి
పూలు నవ్వుతాయి
పరిమళాలు గుభాళిస్తాయి
ఆకులూ నవ్వుతాయి
చల్లగాలి వస్తుంది
అవును! సాయంత్ర సంధ్యలో మరో చిరునవ్వు
ఎంతో వికాసం,
మళ్ళీ నిశ్శబ్దం
మనస్సు ముచ్చట్లు, చిన్న చిన్న మాటలు
నక్షత్రాలు బారులు తీరిన చప్పట్లు
కళ్ళు ఆర్పగానే నేల చిట్లుతున్న శబ్దాలు
కళ్ళలోనే నదుల సవ్వడి
చూపులోనే తరంగాల శ్రుతి
దారిపక్కంతా పచ్చని చెట్లు
పొన్నాయి పూలదారి
పచ్చికొబ్బరిముక్కల్లాగా
తంపటేసిన జీడిపిక్కల్లాగా!
ఆ పడతి మాటలన్నీ రుచిగా ఉంటాయి
ఆ చూపులకు నక్షత్రాలు నదుల్లో స్నానాలు చేస్తున్నాయి
మనుషుల్లో స్వచ్ఛత నశిస్తుందా!
నదులు కల్మషమైనట్లే
మనుష్యులు కల్మషమౌతున్నారా!
శబ్దాలన్నీ మాటలు కాలేవు
మాటలన్నీ నిజాలు కాలేవు



నిజాలన్నీ సార్వత్రికం కాలేవు
అవును! రోజూ నవ్వలేక
నవ్వులకొక దినమా!
బలవంతంగా నవ్వులా!
నవ్వు జీవితంలో నుంచి రాదా!
పక్షులకు ఎగరడం ఎవరు నేర్పారు
అవును! ఆ పాటల్లో మాధుర్యమే కాదు
ఆవేదనా వుంది!
పొగొట్టుకొన్న జీవితం ఉంది!
తెంచుకోలేని సంకెళ్ళు ఉన్నాయి
లోతైన చీకటి ఉంది
తరంగాలు తరంగాలుగా వెన్నెల
జుంటితేనియల వర్షం
కొవ్వొత్తుల వెలుగుల ముసురు
పాటలో ఇన్ని ప్రకృతులా!
పాట వినేవాడు ఆనందిస్తున్నాడు
పాడే పడతి కళ్ళల్లో నీళ్ళు ఉన్నాయి
ఆ నీటి బొట్టుల్లో భవిష్యత్తు దర్శనం ఉంది
ఆ రూపం ఒకనాడు శిల్పం కంటే గొప్పది
ఆ శిల్పం ఎన్నో తుఫానులు ఎదుర్కొంది
ఇప్పుడు పురావస్తు గుర్తుగా మిగిలింది
దానిచుట్టూ ఓ జాజితీగ అల్లుకొంది
ఆ పూలు ఆ శిల్పానికి పరిమళం తెచ్చాయి
అవును! ఆ శిల్పానికే పువ్వులు పూశాయి
అవును! ఆ సరస్సుల్లో తేలుతున్న తామర పువ్వులు
ఆ కొలనుకు పరిమళం తెస్తున్నాయి
అంతరంగంలో నవ్వినప్పుడే
అది పెదాల మీద చిగురిస్తుంది
అవును! ఇది నవ్వుల రోజే
శిశువు పెదాల మీద నవ్వు
తల్లి కన్నుల్లో చిగురించిన నవ్వు
ప్రతి క్షణం వెలిగించే నవ్వు
అవును! ఆ శిల్పాన్ని అల్లుకున్న
అన్ని తీగలకు పువ్వులు పూశాయి
శిల్పంలో వన్నె తరగలేదు
చరిత్రకు అది పెద్ద ఆనవాలు సుమా..!

# యాభై ఏళ్ల నాటి విద్యార్థి జీవితానికి ప్రతిబింబం

- డా. పి.వి.లక్ష్మణరావు
9492043837

నవీన్



అంపశయ్య

*తల్లిని క్యాంటీన్‌గా, తండ్రిని ఏటీయంగా భావించే నేటివిద్యార్థినీ, విద్యార్థులు.. ఓ యాభై ఏళ్ల క్రితం విద్యార్థుల జీవితం ఎలా ఉందో తెలుసుకోవాలంటే ఈ నవలను తప్పక చదవాల్సిందే. తెలుగు జాతినంతటినీ ఓ ఊపు ఊపిన ఈ నవల **1965-70** సంవత్సరాల్లోని తెలంగాణ గ్రామీణ జీవితాన్ని ముఖ్యంగా నాటి పేద, మధ్య తరగతి విద్యార్థుల జీవితానికి అద్దం పట్టింది. ఆనాటి విద్యావ్యవస్థకు నిలువుటద్దంలా నిలిచింది.*

తెలుగు సాహిత్యచరిత్రలో వచ్చిన గొప్ప గ్రంథాల్లో ఒకటిగా 'అంపశయ్య' నవల నేటికీ నిత్యనూతనంగా విద్యార్థుల్ని, పాఠకుల్ని ఆకర్షిస్తూనే ఉంది. ఈ పుస్తకం ఎంత ప్రసిద్ధమంటే ఈ నవల పేరే రచయితకి ఇంటి పేరుగా కూడా మారిపోయింది.ఎన్నో ప్రశంసలు, విమర్శలు, విశ్లేషణలు, మనస్తత్వశాస్త్ర ఆధారంగా పరిశీలనలు, చర్చలతో ఇన్నేళ్ళ తెలుగు నవలా చరిత్రలో ప్రత్యేకతను నిలుపుకున్న రచన ఇది. నవీన్ ఈ నవలని 1963లో మొదలెట్టి 68లో పూర్తి చేసారు. తెలుగు సాహిత్యంలో చైతన్యస్రవంతి అంత విరివిగా వాడుకలోకిరాని కాలంలోనే చైతన్యస్రవంతి శిల్పాన్ని సమర్థవంతంగా ప్రయోగించడం,అప్పటికే రచయితకి ఆంగ్లసాహిత్యంతో కూడా మంచి పరిచయం ఉండటంతో అనితర సాధ్యమైన శైలీశిల్పాలతో, కళాత్మక ప్రమాణాలతో ఈ నవల రూపుదిద్దుకున్నది.

తల్లిని క్యాంటీన్‌గా, తండ్రిని ఏటీయంగా భావించే నేటి విద్యార్థినీ, విద్యార్థులు.. ఓ యాభై ఏళ్ల క్రితం విద్యార్థుల జీవితం ఎలా ఉందో తెలుసుకోవాలంటే ఈ నవలను తప్పక చదవాల్సిందే. తెలుగు జాతినంతటినీ ఓ ఊపు ఊపిన ఈ నవల 1965-70 సంవత్సరాల్లోని తెలంగాణ గ్రామీణ జీవితాన్ని ముఖ్యంగా నాటి పేద, మధ్య తరగతి విద్యార్థుల జీవితానికి అద్దం పట్టింది. ఆనాటి విద్యావ్యవస్థకు నిలువుటద్దంలా నిలిచింది.

పాత్రల అసాధారణ లేదా అపసామాన్య మనస్తత్వాన్ని చిత్రించేందుకు రచయితలు ఓ కొత్త పద్ధతిని ఉపయోగించుకొన్నారు. అదే చైతన్యస్రవంతి శిల్పం. మనోవిజ్ఞానంలోని చేతనాచేతన సిద్ధాంతం (అంటే థియరీ ఆఫ్ అన్కాన్షస్), మనో విశ్లేషణ ప్రభావం ఈ రెండింటి ఆధారంగా చైతన్య స్రవంతి శిల్పం రూపొందింది. దీనికి కారకుడు హెన్రీ బెర్గ్ సన్. చైతన్య స్రవంతి...స్ట్రీం ఆఫ్ కాన్షియస్...ఆధునికతలో భాగంగా కాల్పనిక నవలా రచనలో ఇదొక ముఖ్య ప్రయోగంగా దీన్ని విమర్శకులు గుర్తించారు. ఈ తరహా సాహిత్యం అంటే.. ఒక పాత్ర మనసులో వచ్చే ఆలోచనాస్రవంతి, అది ఎలా వస్తే అలాగే ఒక ప్రవాహంలా చిత్రించే రచనాపద్ధతి. మనిషి మెదడులో మెదిలే ఆలోచనలు, భావాలు, జ్ఞాపకాల దొంతరలు, అడ్డూ అదుపు లేని అక్షరాల ప్రవాహం. మనసుకు ఏదితోస్తే అది, ఏది గుర్తుకు వస్తే అది. ఇంకా చెప్పాలంటే ఆ మనసుతో, ఆ పాత్రతో, ఆ పాత్ర ఆలోచనలతో, ఆ అక్షర ప్రవాహంలో కొట్టుకొని, ఆ ఝరిలో

మనమూ పరుగెడుతూ, అలసి సొలసి ఊపిరి తీసుకోకుండా నవల చివర అక్షరం వద్ద మాత్రమే ఆగుతాం.

సంజీవమ్మ మాటల్లో చెప్పాలంటే "కొన్ని గంటల కాలంలో వ్యక్తి చేసే వివిధ ఆలోచనలే ఇతివృత్తంగా పాశ్చాత్యభాషల్లో చైతన్యస్రవంతి శిల్పంలో నవలలు వచ్చాయి. ఒక క్షణంలో వ్యక్తి అంతరంగంలో ప్రవహించే ఆలోచనలు ఎన్నో విషయాలకు సంబంధించి ఉండవచ్చు. రచయిత స్వయంగా పాత్రల ఆలోచనల్ని పాఠకునికి వివరించటంలో అంతరాంతరాల్లోని అనేకానేకాలైన ఆలోచనలన్నీ వ్యక్తం చేయడం సాధ్యం కాదు. ఒక క్రమం లేని, చిత్రమైన, ఊహించ సాధ్యంకాని ఆలోచనలెన్నో అంతరంగంలో చెలరేగుతూ ఉంటాయి. అవన్నీ వ్యక్తం చేయడానికి ఈ శిల్పంలో సాధ్యమవుతుంది. ఇలా చేయడం మూలాన రచయిత పాత్రల అంతరంగాన్ని ఏ అరమరికలు దాపరికం లేకుండా ఉన్నది ఉన్నట్లు పాఠకుని ముందుంచినట్లవుతుంది. దాని వల్ల పాత్రను పూర్తిగా అర్థం చేసుకోడానికి, పాత్రతో పాఠకుడు తాదాత్మ్యం పొందడానికి సాధ్యం అవుతుందని అభిప్రాయం".

నాటి విద్యావ్యవస్థకు ప్రతిబింబం అంపశయ్య. ఈ నవల ఒకానొక తెల్లవారుజామున యూనివర్సిటీ హాస్టల్ గదిలో కథానాయకుడు రవికి ఒక కల రావడంతో మొదలవుతుంది.

నాటి విద్యావ్యవస్థకు ప్రతిబింబం అంపశయ్య. ఈ నవల ఒకానొక తెల్లవారుజామున యూనివర్సిటీ హాస్టల్ గదిలో కథానాయకుడు రవికి ఒక కల రావడంతో మొదలవుతుంది. ఆ కలకు అర్థమేమిటో రవికి బోధపడదు. ఆ కలనుంచి మేలుకున్న రవిలో మొదలైన ఆలోచనల ప్రవాహం నిరంతరంగా పరిగెడుతూ 18గంటల పాటు నడిచి చివరికి ఆ రాత్రి అదే గదిలో ముగుస్తుంది. అతను పొద్దున్నే కల గంటూ లేచింది మొదలు రాత్రి పడుకొనే వరకూ అతని ఆలోచనలు అన్నీ ఇందులో ఉంటాయి. అతను మిత్రులగుంపులో నడుస్తున్నా మిత్రుల మధ్య జరిగే సంభాషణ కంటే అతని మనసులో జరిగే భావాల పరంపర అంతా ఈ రచనలో ఉంటుంది.

ఒక స్వప్నంతో ప్రారంభమైన ఈ నవలలో అడుగడుగునా చైతన్యస్రవంతి శిల్పం గోచరిస్తూనే ఉంటుంది. రవి చివరకు అంపశయ్య లాంటిపక్క మీదకు చేరుకొని నిద్రపోయే సన్నివేశంతో రచయిత అతని చైతన్యస్రవంతి ద్వారా ఆనాటి అతని అనుభవాలను ఆనాడు అతనిలో చెలరేగిన విభిన్నకాలాలకు సంబంధించిన స్మృతి పరంపరలను సింహావలోకనం చేస్తాడు. ఈ సందర్భంలో రచయిత వేగవంతమైన శైలి ద్వారా చైతన్యస్రవంతి శిల్పాన్ని పరాకాష్ఠ నొందించాడు.

మనసును కదిలించే ఎన్నో సన్నివేశాలు ఈ నవలలో ఉన్నాయి. అవన్నీ వాస్తవానికి దగ్గరగా ఉన్నవే..! కథ అంతా ఉస్మానియా యూనివర్సిటీలోనూ, హాస్టల్లోనూ ఒక రోజంతా నడిచే కథనమే. ఈ నవల చదువుతుంటే అప్పటికాలం నాటి పరిస్థితులు మనకు కళ్ళకు కట్టినట్లు కనపడతాయి. ఉదాహరణకు, అప్పట్లో అబిడ్స్ ప్రాంతంలో ఉన్న సినిమా థియేటర్లలో కరెంట్ పోతే జనరేటర్ ఉండదు. మళ్ళీ కరెంట్ వచ్చేంతవరకు ఎదురుచూడడమే ప్రేక్షకుల పని. హాస్టల్ విద్యార్థుల జీవనాన్ని చాలా వాస్తవంగా ఉన్నది ఉన్నట్లుగా కళ్ళకుకట్టారు. ఇంకా ఇందులోని ప్రధాన పాత్ర అయిన రవికి సంబంధించిన ఫ్లాష్ బ్యాక్ ఒక చిన్న ఉపకథ లాగా ఉంటుంది, నిజంగా అది గుండెలని పిండే కథనం. అలాంటి జీవన విధానం అప్పట్లో గ్రామాల్లో ఉండేది.

ఇంకా లక్ష్యశుద్ధిలేని అప్పటి విద్యావిధానం, చిత్తశుద్ధిలేని బోధనా పద్ధతి, భవిష్యత్తుకి ఏమాత్రం గ్యారెంటీ లేని పాలన, సమస్త జీవన రంగాన్ని కలుషితం చేసిన కృత్రిమ విలువలు ఆనాటి విద్యార్థుల్ని ఏ విధంగా నిర్వీర్యులుగా మార్చి పెడదారులు పట్టిస్తున్నది మొదలుగా గల విషయాలు కూడా ఈ నవలలో సమర్థవంతంగా చిత్రించబడ్డాయి. అయితే మావోనూ, మార్క్సునూ, వియత్నాం పోరాటాన్ని అభిమానిస్తూనే, నెహ్రూ గారి సోషలిజాన్నీ ప్రణాళికల్నీ బలపరచటమే వీటన్నింటికి విరుగుడన్నట్లుగా భావించే అమాయకులే అభ్యుదయవాదులుగా ఇందులో పరిచయమవుతారు, ఇందుకు ఆయా పాత్రలనుగానీ, రచయతను గానీ నిందించనవసరం లేదు. ఈ నవలా కాలం నాటి వాతావరణం అలాంటిది.

ఇంటి నుంచి తల్లిదండ్రులు చెమటోడ్చి పంపే డబ్బుతో ఉస్మానియాలో ఎంఏ చదువుతున్న రవి తెలివైన వాడే అయినా, పరీక్షలు దగ్గర పడేవరకూ చదవకుండా తిరిగేసి అవి ముంచుకొస్తుంటే కొద్దిగా అయినా చదవలేకపోతున్నాననే అపరాధభావనలో పడి తనను తాను నిందించుకునే మనస్తత్వం కలిగినవాడు. అంతేకాదు రవికి వచ్చే ఆలోచనలకు క్రమం ఉండదు. ఒక ఆలోచనపైకి మరొక ఆలోచన వచ్చి పడుతూ ఉంటుంది. శ్రద్ధగా చదివి ఫస్ట్ క్లాస్ తెచ్చుకోవాలని అనుకుంటాడు. కానీ ఆ పని చేయలేడు. ఏవేవో ఆలోచనలు!

కష్టాల్లో ఉన్న తల్లిదండ్రులు, పల్లెలో అన్యాయమైపోయిన రత్తి, ఇంకా ఏవేవో పాత జ్ఞాపకాలు మెదడులో సుళ్ళు తిరుగుతుంటాయి. ఆ ఆలోచనల సంఘర్షణలోనే టాయ్‌లెట్ గోడల మీది బూతురాతలు గుర్తొస్తుంటాయి. బయటికి చెప్పలేని లైంగిక అశాంతి రేగుతూ ఉంటుంది. దాన్ని జయించాలని చూసినా ఫలితం ఉండదు.

> **సహజమైన వైరుధ్యాలు రవిలో అడుగడుగునా కనిపిస్తుంటాయి. మార్క్స్ ఆలోచలని ప్రేమించే అభ్యుదయవాది అయిన రవికి రిక్షావాడు తన దగ్గర రూపాయి వసూలు చేయడం దోపిడీగా కనిపిస్తుంది.**

ఇలాంటి రవికి డబ్బుతో మిడిసి పడే రెడ్డి, అతడి బృందం వేడి రక్తంతో అభ్యుదయం గురించి మాట్లాడే వేణు ప్రతినాయక ఛాయల్లో కనిపించే శ్రీశైలం, రంగారెడ్డి అలాగే లెక్చరర్ ఉపేంద్రబాబు, సీనియర్ విద్యార్థులు ఆనందరావు, గుర్నాథం,ఆచారి. వెధవ బోరింగ్ యూనివర్సిటీ చదువు అయిపోతే అమెరికాకి స్వేచ్ఛగా ఎగిరి పోదామనుకునే డబ్బున్న కిరణ్మయి అనేవారు పరిచయమవుతారు. వీరిలో రవికి కొంతమంది మంచి మిత్రులు, మిత్రులైనా కాకపోయినా మరికొందరు హాస్టల్‌మేట్లూ ఉంటారు. సాటి విద్యార్థుల్లో కొందరు బాగా డబ్బున్నవాళ్ళు, ఆ ధనమదాన్ని ప్రదర్శిస్తూ తిరిగేవాళ్లు, ఉంటారు. వాళ్లంటే రవికి అసహ్యం.

కానీ వాళ్ళతో తలపడాలంటే భయం. ధనం తెచ్చిన బలంతో యూనివర్సిటీలో వాళ్లదే పై చేయిగా ఉంటుంది. న్యాయం తమ వైపు ఉందని తెలిసినా గట్టిగా పోరాడలేని విద్యార్థుల గ్రూప్ రవిది. కానీ వాదనకు దిగాల్సి వచ్చినపుడు రెచ్చిపోయి మాట్లాడేసి ఆ తర్వాత వాళ్ళు తనను చంపేస్తారేమో అని భయపడతాడు. ఒకానొక దుర్బల క్షణంలో వాళ్ళు మెచ్చేలా ఉండి, తన డబ్బు అవసరాలు తీర్చుకుందామని కూడా భావిస్తాడు. కానీ అతని ఆత్మాభిమానం ఆ పని చేయనివ్వదు. ప్రతి విషయంలోనూ, ప్రతి క్షణం ఇలా ద్వైదీభావంతో కొట్టుమిట్టాడుతుంటాడు రవి.

ఇలాటి సహజమైన వైరుధ్యాలు రవిలో అడుగడుగునా కనిపిస్తుంటాయి. మార్క్స్ ఆలోచలని ప్రేమించే అభ్యుదయవాది అయిన రవికి రిక్షావాడు తన దగ్గర రూపాయి వసూలు చేయడం దోపిడీగా కనిపిస్తుంది. ఎక్కేటపుడు ఎలా ఉన్నాడో గమనించని రవికి, అతడు రూపాయి డిమాండ్ చేయగానే రౌడీ లాగా కనిపిస్తాడు. రిక్షావాడి ప్రవర్తన అతని రూపాన్ని కూడా బూచిలా చేసి చూపిస్తుంది. ఇలా మనుషులందరిలోనూ కామన్‌గా ఉండే అనేక సహజ ప్రవృత్తుల్ని, బలహీన క్షణాలని, భావావేశాల్ని నవీన్ ఈ నవలలో రవి పాత్రలో చిత్రించారు.

చేతిలో పైసా లేకపోయేసరికి అంతిమంగా రవి ఆలోచనలు చావు వైపు మళ్ళుతాయి. శ్రీశైలంతో గొడవ జరిగినపుడు, 'అతడు తనని చంపేస్తే?' అన్న భావనతో సతమతమవుతాడు. తను శ్రీశైలం చేతిలో మరణించినట్టు, తల్లి కుమిలి కుమిలి ఏడ్చినట్టు, ఊహించుకుని తృప్తి పడతాడు. తను కూడా ఆ దుఃఖపు బరువుని మోస్తాడు. రోడ్డు మీద మోటార్ సైకిల్ వాడు తప్పుకోమని గద్దించినపుడు తాను దాని కింద పడి మరణించినట్లు, 'మోటార్ సైకిల్ కింద పడి విద్యార్థి మరణం,' అనే వార్తను కూడా ఊహించుకుంటాడు. ఎలుకల మందో ఎండ్రినో తాగి తాను కాస్తా చస్తే యూనివర్సిటీలో నలుగురూ ఏమనుకుంటాడో వాళ్ల వాళ్ళ ధోరణుల్ని బట్టి ఊహించుకుంటాడు. 'నా కొరకు చెమ్మగిల్లు నయనమ్ము' ఉండాలని ప్రతి మనిషీ కోరుకున్నట్టే రవి తన చావుకి ఎవరెలా స్పందిస్తారో ఊహించుకుని సానుభూతి ఆశిస్తాడు.

ఇకపోతే రవి గత జీవితంలోని రత్తి పాత్ర ప్రత్యేకం. నిష్కల్మషంగా, నిజంగా ఇష్టపడిన రత్తి పట్ల తాను ప్రవర్తించిన తీరు రవిని ఆలోచనల్లో నిరంతరం వెంటాడుతూనే ఉంటుంది. కిరణ్మయి విషయానికొస్తే ఆమెతో సినిమా చూసే క్షణికమైన ఆనందం కోసం తాను అసహ్యించుకునే గుర్నాథం వద్దే చేయి చాచి అయిదు రూపాయలు సంపాదించి సినిమా చూడాలని వెళ్తాడు. ఆర్థిక స్థోమత విషయానికొస్తే తాను కిరణ్మయి సమీపానికి కూడా చేరలేనని తెలుసు. అయినా సరే యవ్వన చాపల్యంతో, ఆమె గాలి సోకినా అదృష్టమే అనుకుంటాడు. అప్పు చేసి మరీ వెళ్ళిన రవి అక్కడ జరిగిన జ్ఞానోదయంతో యూనివర్సిటీకి తిరిగి వస్తాడు. జీవితంలో విషాదపు కోణాన్ని కిరణ్ ఏ మాత్రం సహించదనీ, ఆమెది కలతలే లేని రంగుల లోకమనీ ఆ తర్వాత గ్రహిస్తాడు. తామిద్దరూ సమాంతర రేఖలన్న సత్యంబోధపడుతుంది. ఇదంతా జరిగినరోజునే ప్రతి నాయక బృందంతో జరిగిన ఘర్షణలో బలహీనులంతా ఏకమై రవితో పాటు వారిని ఎదుర్కోవడంతో కథ ముగుస్తుంది.

రవిలో విస్తృతంగా పరచుకున్న లైంగిక అశాంతి: ఇరవయ్యేళ్ల వయసులో ప్రతి యువకుడూ అనుభవించే స్పష్టమైన, అస్పష్టమైన లైంగిక అశాంతి నవలంతా విస్తృతంగా పరుచుకుని ఉంటుంది. నవీన్ దీన్ని దోబూచులాడే వర్ణనల మాటున దాచక విస్పష్టంగా రవి కోణం నుంచి వ్యక్తపరుస్తూ

పోవడం చాలా మందికి మింగుడు పడినట్టు కనిపించదు. అందుకేనేమో ఈ నవల్లో అశ్లీలత ఉందని కొందరు సమీక్షకులు అభిప్రాయపడ్డారు.

స్నేహితులు వేసే అశ్లీలమైన జోకుల్ని అసహ్యించుకుంటూనే మరో పక్క ఆ ఆలోచనలకు ఆనకట్ట వేయలేని

**ఈ నవల గొప్పదనమంతా ఈ నవల ముగింపులోనే ఉంది. వాస్తవిక నవలల్లో ఇలాంటి విప్లవాత్మకమైన ముగింపు అదీ అత్యంత సహజంగా అనిపించేలా తీసుకురావడం అనితరసాధ్యమే.**

సహజ బలహీనత రవిలో కనిపిస్తుంది. 'సరళ' మీద భజగోవిందం వేసే జోకుల్ని మనసులో 'ఛీ' అని తిరస్కరిస్తూనే మరో వైపు క్లాసులో పడీ పడీ నవ్వుతున్న అమ్మాయిల అందాల్ని పరికించకుండా ఉండలేకపోతాడు. రత్తి నుంచీ గుర్నాథం భార్య వరకూ ఊహల్లో ఎవరినీ వదిలి పెట్టడు. ప్రాణాలు పోయేంత ఆకలితో లెక్చరర్ ఇంటికి వెళ్ళినపుడు కూడా లోపలి నుంచి బోర్నవిటా పంపిన లెక్చరర్ భార్య ఒక్కసారి కనిపిస్తే బాగుండనుకుంటాడు. ఆమె గొంతు విని ఆమె అందచందాలను ఊహించాలని ప్రయత్నిస్తాడు. ఒక పక్క కిరణ్మయిని ఆరాధిస్తూనే నీరజ, లిల్లీ, శశి, సుధ, నళిని, వీళ్లందరి అందాలనూ మొహమాటం లేకుండా కళ్ళతోనే అంచనాలు వేస్తాడు. వీళ్లతో పాటు ఆదారిన పోయే ఫ్రెంచ్ లేడీని, బ్రిగటా బార్డాట్ అంత సెక్సీగా ఉందంటాడు.

హాస్టల్లో ఎవరో ఒకమ్మాయితో ఇద్దరు స్టూడెంట్స్ లవ్ మేకింగ్‌లో దొరికారని అంతా చెప్పుకునే వార్త పట్ల ఆశ్చర్యంతో కూడిన ఆసక్తిని ప్రదర్శించి, ఆ తర్వాత కూడా 'అదెలా సాధ్యం అసలు?' అని దాని గురించే ఆలోచిస్తాడు. రోడ్డు పక్కన బస్ కోసం వెయిట్ చేస్తున్న స్త్రీని తోటి విద్యార్థులు నీచంగా వ్యాఖ్యానిస్తున్నా ఖండించడు. అలాగని వాళ్ళు అలా కామెంట్ చేయడం రవికి నచ్చుతుందా అంటే లేదు! సెవెన్ యియర్స్ ఇచ్ సినిమాలో మార్లిన్ మన్రో స్కర్ట్ గాలికి లేచే ఫొటో ఎన్నో సార్లు తనివి తీరా చూస్తాడు. సినిమా హాలు ముందు హాలీవుడ్ నటీమణుల సెక్సీ పోజులు చూసి ఆనందిస్తాడు. పుస్తకాల షాపుల వద్ద న్యూడ్ ఫొటోలు చూసి చలిస్తాడు. పచ్చిగా ఊహించుకుంటాడు. ఆ వయసు యువతలో చెలరేగే లైంగిక అశాంతిని అనుక్షణం అనుభవిస్తుంటాడు. ఆ ఆలోచనలని ఆపలేడు. అతని వల్ల కాదు.

ఈ లైంగిక అశాంతి అందరికీ సహజమే కావొచ్చు, ముఖ్యంగా ఆ వయసులో. కానీ అవి తనను సతమతం చేస్తున్నట్లు ఎవరికీ తెలియకూడదు. పూజలతో తన రూమ్‌నే గుడిలా మార్చిన ఆచారి సెక్స్ పుస్తకాలు చదువుతూ రవి కంటబడినపుడు పడే కలవరం కూడా దీన్నే చిత్రిస్తుంది. ఈ ధోరణిని రవిలోని ఒక కోణాన్ని ఆధారంగా తీసుకుని నవీన్ అద్భుతంగా ఆవిష్కరిస్తారు ఈ నవలలో!

రకరకాల మనస్తత్వాల మధ్య చేతిలో పైసా లేని స్థితిలో రవి జీవితంలో జరిగే కొద్ది గంటల కాలం ఈ నవల. ఈ నవలలో ఆకలి కేకల నుంచి అమెరికా వెళ్ళాలని పాట్లు పడే కిరణ్మయి బాధల వరకూ రచయిత స్పృశించారు. యూనివర్సిటీ ప్రొఫెసర్లలో ఉండే కులతత్వం, మతతత్వం, యూనివర్సిటీ రాజకీయాలు, విద్యావిధానం రోజురోజుకు కునారిల్లుతున్న దుర్గతి, ప్రొఫెసర్లు రీడర్ల మధ్య వైషమ్యాలు, విద్యార్థుల సాంఘిక సమస్యలు, వాళ్ళ మనస్తత్వాలు, భవిష్యత్తు గురించిన వాళ్ళ ఆలోచనలు... ఇవన్నీ ఈ నవలలో కనిపిస్తాయి. చర్చకు వస్తాయి. రవి కానివ్వండి, అతడి మిత్రబృందంలో మరెవరైనా కానివ్వండి. ప్రతి ఒక్కడూ ఈ అంపశయ్య మీద పవళించి తీరాల్సిందే.యూనివర్సిటీ జీవితాన్ని, ముఖ్యంగా హాస్టల్ జీవితాన్ని చవి చూసిన ప్రతి వారూ, ఈ నవలలో తమ నీడను చూసుకుని చకితులవుతారని చెప్పడం సాహసం కావొచ్చు కానీ సత్యం మాత్రం కాకపోదు" అంటారు సృజన పత్రికలో ఈ నవల ప్రారంభానికి ముందు సంపాదకులు. ఇది అక్షర సత్యమే!

మొత్తమ్మీద నవల మొదట్లోనూ మధ్యలోనూ అక్కడక్కడా చైతన్య స్రవంతిలో మనకు వినిపించే కొన్ని మాటలు, సన్నివేశాలు అసభ్యంగా అనిపిస్తాయి. వాటిని మినహాయిస్తే ఇది నిజంగా ఒక అద్భుతమైన నవల. ఈ నవల గొప్పదనమంతా ఈ నవల ముగింపులోనే ఉంది. వాస్తవిక నవలల్లో ఇలాంటి విప్లవాత్మకమైన ముగింపు అదీ అత్యంత సహజంగా అనిపించేలా తీసుకురావడం అనితరసాధ్యమే. ఇన్ని విశిష్ట లక్షణాలు కలిగి ఉన్నది కాబట్టే చైతన్యస్రవంతి శిల్పంతో వెలువడిన నవలల్లో అగ్రస్థానంలో నిలిచింది అని చెప్పడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. దానితో పాటు నాటి సమాజంలోని మధ్య తరగతి విద్యార్థుల జీవన స్థితిగతులను ఎంతో చక్కగా చిత్రించారు.

❋

# మనిషి కావాలి...

- కెంగార మోహన్
9493375447



అంతర్ధానమైన మనిషిని వెంటనే
వెతకండి
సమూహం నుంచి
సమాజం నుంచి
తనకు తానే వ్యామోహబంధాల శిక్ష
విధించుకుని
కొత్త ప్రపంచాన్ని అన్వేషిస్తూ వెళ్ళిన
వాడు
ఎక్కడ కనిపించినా పట్టుకు రండి
ఇపుడు మనిషి కావాలి
మెదడు స్థానం శిరస్సు నుంచి
వెలివేయబడి
చూపుడు వేలే మస్తిష్కంగా
అవతరించిన
నిత్య నూతన మనిషి
ఏ టచ్‌స్క్రీన్‌లనో నొక్కుతూ
కనిపిస్తాడు
చిన్న మెదడు, పెద్దమెదడూ అన్నీ
వేళ్లల్లోనే
కాస్త గమనించండి సత్వరమే
ఈ ప్రపంచానికి మనిషి కావాలి
వీడికి వీడే బ్రాండ్ అంబాసిడరై
సర్వసుఖాల చక్రబంధాల్లో ఇరుక్కుని
మనిషితనాన్నే కార్పోరేటు
మార్కెట్లో అమ్మకానికుంచిన
ఈ మనిషిని విలువల వలేసి
పట్టుకురండి
ఎందుకంటే మనిషనే వాడు ఇప్పుడు
కావాలి
అప్పుడెప్పుడో ఏళ్ళ క్రింద
కమ్మగా కబుర్లు చెప్పుకునో
ఉమ్మడిగా భోంచేస్తో
ఎలా వున్నావంటూ పలకిరిస్తో
బతుకుతున్న మనిషి హలో అంటూ
ఎక్కడికో కొత్తశకానికి తెరతీస్తూ
పరుగులు పెట్టిన ఆ మనిషి
పగవాడి పద్మవ్యూహం నుంచి
వెంటనే విడిపించుకు రండి
ఇప్పుడు మనిషనే వాడే లేకపోతే
ఈ విశ్వం ఏమైపోతుంది
కాలం కోసమైనా మనిషిని
పంజరం నుంచి విడిపించుకు రండి
వాడు ఎన్ని కొత్త ప్రపంచాలు
పురుడుబోసి పుట్టించాడో తెలుసా
డార్విన్ థియరీ కంటే
బిగ్‌బ్యాంగ్ ప్రయోగం కంటే
గొప్పగా ఆలోచించి
ఏ శుక్రకణాల అవసరం లేకుండానే
జీవ, రసాయన, భౌతిక చర్యలు
అక్కర్లేకుండా
హాట్టి ట్రాన్స్‌మీటర్లు, డయోడ్,
రెసిస్టర్లాంటి
చిప్పులతోనే మస్తిష్కాన్ని చూపుడువేల్లో
బంధించి
ట్విట్టర్లు, ఫేస్బుక్కులు, వాట్సప్‌లు,
మెస్సంజర్లు అంటూ
ఎంతోమంది జన్మలకు కారకుడై
మంత్రసానై కాన్పులు చేశాడని...
ఇప్పటికైనా సిద్ధమవ్వండి
మనిషని అపుడెప్పుడో
మనకు మనం నామకరణం చేసుకున్న
వాడిని
కాస్త వెతికి పట్టుకురండి
మాటల్లేకుండా మమతల్ని
చేతలతో పనిలేకుండా విలువల్ని
ఎలా హత్య చేస్తున్నాడో తెలుసా..
ఏ క్రైమ్‌రికార్డుల్లోకెక్కని వీడి పేరు
ఏంటో తెలుసా?
ఆధునికుడు..నాగరికుడు..
చాలా గొప్పగా వుంది కదూ..
అంత గొప్ప పేరుంది కాబట్టే
వీడెన్ని విధ్వంసాలు చేసినా
మానవత్వాన్ని చాటని వాడికి రాని
నోబెల్స్ వీడిని వరిస్తాయి
ఆధునికతే..నాగరికతే..ప్రగతని
నమ్మించి మోసం చేసేవాడిదే మాటైనా
శాసనమైనా..
సమసమాజాన్ని నిర్మించేందుకైనా
మనం మనిషిని వెతుకుదాం
మించిపోయింది లేదు
ఎర్రతివాచి పరచి వీడిని స్వాగతించిన
వాడి ఎత్తుల్ని చిత్తు చేయాలంటే
మనం ఎంతో శ్రమించాల్సిన పని
లేదు
వాడున్నది మనుషుల మధ్యనే....

# మనసు గీసిన బొమ్మ

- నవజీవన్
9247810639





"అద్భుతమైన మజిలీ చేయాలనుకుంటే ఇక్కడకు రావాల్సిందే?" "

"పుస్తకాల పురుగులు పాకులాడే చోట ఎలాంటి మజిలీ చేస్తావు?"

"గ్రంథాలయాలు పుస్తకాల పురుగులకు నిలయాలే కావచ్చు. కానీ ఈ చోటుకి ఒక ప్రత్యేకత ఉంది. ఒక చరిత్రకు ఆనవాళ్లు ఇక్కడ దొరుకుతాయి."

అతనితో మాట్లాడుతూ చుట్టూ పక్కల ప్రాంతమంతా ఒకసారి పరికించి చూసాను. దట్టమైన అడవులు దూరంగా కనిపిస్తున్నాయి. ఆ గ్రంథాలయం పక్కనే ఉన్న చిన్న పార్కులో ఒక ముసలతను చిన్నారిని ఆడిస్తూ, రేడియో వింటున్నాడు. ఆ రేడియోలో ప్రసారమవుతున్న ఫైజ్ అహ్మద్ ఫైజ్ గజల్ వినసొంపుగా ఉంది. పార్కులో ఉన్న మిగతా బెంచీలూ కోలాహలంగానే ఉన్నాయి. ఎందరో ఆలుమగలు తమ పిల్లలతో కులాసాగా కబుర్లు చెబుతూ ఒక రకమైన ఆనందాన్ని పొందుతున్నారు.

పుస్తకాలంటేనే నాకు ఆమడ దూరం. మరి నా స్నేహితుడికి అవంటేనే ప్రాణం. వాటితో పాటు ప్రకృతి, పారవశ్యం, ప్రేమ, మనసు, జీవిత సత్యం.. లాంటి పదాలతో నాకు అర్థమవ్వని భాషలోనే ఎప్పుడూ మాట్లాడుతూ ఉంటాడు.

కాస్త ధైర్యం చేసి మళ్ళీ వాడిని ఒక మాట అడిగాను.

"ఇంకా చాలా జీవితముండగా నీకు ఈ వైరాగ్యం అవసరమా..! ఈ రోజు నీతో వస్తానని మాట ఇవ్వకపోతే ఇంటికెళ్లి హాయిగా ఏ చార్లీ చాప్లిన్ సినిమానో చూస్తూ, చికెన్ సూప్ తాగుతూ గడిపేవాడిని"

నావైపు తిరిగి ఒక చిన్న నవ్వు నవ్వాడు వాడు.

"ఒక గంట సేపు ఓపిక పట్టు మిత్రమా! ఈ రోజు ఇక్కడ ఒక విచిత్రం జరగబోతోంది. మనిషి జీవితానికి దిక్సూచిని చూపించేది చదువుకున్న చదువో, చేస్తున్న వృత్తో కాదు. బతుకు బాట బహుచక్కగా సాగిపోతూ, ఎలాంటి ఒడిదుడుకులు లేకుండా జీవితం సాగిపోవాలనే అందరూ కోరుకుంటారు. కానీ అంతకు మించిన సత్యాన్వేషణ చేస్తే, ఎవరి జీవిత లక్ష్యాలు వారికి తప్పకుండా తెలుస్తాయి. నాకు తోడుగా వచ్చినందుకు సంతోషం."

"నర్లే.. నేను అసలు ఈ గ్రంథాలయంలో నాకు పనికొచ్చే మెటీరియల్ ఏదైనా దొరుకుతుందేమో వెళ్లి అన్వేషిస్తాను. నీ పని పూర్తయ్యాక ఒక మిస్డ్ కాల్ ఇవ్వు." కావాలనే వాడి మాటల నుండి తప్పించుకునేందుకు అలా చెప్పి, నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ ఒక పురావస్తుశాలలా కనిపిస్తున్న శిధిలాలయంలోకి అడుగుపెట్టాను.



అలా అడుగు పెట్టానో లేదో, ఎదురుగా తైలవర్ణ చిత్రంలో బోసి నోరుతో కనిపిస్తున్న గాంధీ మహాత్ముడు నవ్వుతూ ఆహ్వానించాడు.

ఆ తైలవర్ణ చిత్రాన్ని చూడగానే నాలో ఏదో తెలియని స్పందన కలిగింది. గాంధీ ఒక వైపు నవ్వుతున్నట్లు కనిపిస్తున్నా, మరోవైపు ఎలాంటి భావాన్నీ చూపించని చలనం లేని జీవిలా చిత్రంలో దర్శనమివ్వసాగాడు. నాకు తెలిసి ఇలాంటి ఫీలింగ్స్ కొన్ని చిత్రాలను చూసినప్పుడే కలుగుతాయి. డావిన్సీ గీసిన మోనాలిసా చిత్రం ఎలా మనకు పెద్ద మిస్టరీయో.. ఈ క్షణంలో గాంధీ చిత్రంలోని ఫీలింగ్స్ పట్టుకోవడం కూడా నాకు ఒక మిస్టరీగానే అనిపించింది.

ఆ చిత్రానికి కుడివైపు ఉన్న ఒక చెక్కబీరువాలో చాలా పుస్తకాలు ఉన్నాయి. ఆ పుస్తకాల అట్టలపై కూడా అనేక చిత్రాలు నాకు కనిపించాయి.

"వావ్" నా నోటి నుండి అప్రయత్నంగా ఒక మాట వెలువడింది.

ఆ చెక్క బీరువా నుండి ఒక్కొక్క పుస్తకం నెమ్మదిగా తీసి వాటిపైనున్న బొమ్మలను గమనించసాగాను. ఒక్కో పుస్తకంపై ఒక్కో ప్రముఖుడి బొమ్మ ఉంది. బుకర్ టి వాషింగ్టన్, చేగువేరా, మార్టిన్ లూథర్ కింగ్, వివేకానంద.. ఇలా ఎందరెందరో బొమ్మల రూపంలో ఆ పుస్తకాలపై దర్శనమిచ్చారు. నాకు పుస్తకాలు చదవడం పెద్ద అలవాటు లేకపోవచ్చు. కానీ ఆ పుస్తకాలపైనున్న బొమ్మలు నిజంగానే నన్ను అబ్బురపరిచాయి.

ఒక్క క్షణం నిజంగానే అచ్చెరువునొందాను.

ఆ తర్వాత తీసిన పుస్తకాలన్నీ యథా స్థానంలో పెట్టేసి, బీరువా తలుపు మూస్తుండగా, అదే బీరువాలోని క్రింది అరలో కనిపించిన ఒక పుస్తకం నా దృష్టిని ఆకర్షించింది.

తొలుత ఎందుకులే? అనుకున్నా తర్వాత దానిని నా చేతుల్లోకి తీసుకున్నాను. కొలనులో చేపపిల్లలతో ఆడుకుంటున్న ఒక నాలుగేళ్ల బాలుడి వర్ణచిత్రం ఆ పుస్తకం అట్ట మీద దర్శనమిచ్చింది

"దీని అర్థం ఏమిటై ఉంటుందబ్బా?" ఒక క్షణం మేధోమథనం చేయడానికి ప్రయత్నించాను.

అప్రయత్నంగానే నా మనసు ఆ చిత్రాన్ని తనదైన శైలిలో సమీక్షిస్తూ తనకు తానుగా ఒక కథను అల్లుకోసాగింది. ఆ చిన్నారి బాలుడు కర్పూరద్వీపంలో పుట్టాడని, చిన్నప్పుడే అద్భుత శక్తులను పొందాడని, ముద్దు ముద్దు మాటలు మాట్లాడుతూ అందరి ప్రేమను పొందేవాడని, ఎందరో చిన్నారులు స్నేహామృతంతో ఆ పసివాడి దాహాన్ని తీర్చేవారనేది ఆ కథ సారాంశం. ఆట పాటలతో ఆనంద డోలికల్లో తేలియాడే ఆ బాలుడు ఎవరు? సాక్షాత్తు ఏ గాంధర్వుడో భూమండలంపై ఈ బాలుడిగా జన్మించలేదు కదా.. ఇలా ప్రశ్నల పరంపరతోటే సాగిపోయింది నా కథ. ఒక చిన్న అలికిడి వల్ల ఆలోచనల నుండి బయట పడ్డాను.

" నాలో ఇంత భావుకత ఉందా. నాకు నేనుగా ఒక కథను ఊహించుకోవడమేమిటి? చిత్రం కాకపోతే..! కథలు, కవితలు అసలు చదవని నాలో ఒక ప్రేరణను కలిగించి ఒక అందమైన చిత్రం ఒక క్షణం సేపు కథకుడి పాత్రలోకి నన్ను పరకాయ ప్రవేశం చేసేలా చేసిందంటే ఆశ్చర్యమే. ఈ క్రెడిట్ తప్పకుండా ఈ చిత్రం గీసిన చిత్రకారుడికి దక్కుతుంది. ఒక కళ కలిగించే ప్రేరణ ఇలాగే ఉంటుందేమో!" ఒక్క క్షణం మౌనంగా కళ్ళు మూసుకున్నాను.

నా ఊహల్లో ఆ చిన్నారి రూపం ఇంకా చెరిగిపోలేదు.

ఎందుకు అసలు ఆ చిన్నారి చిత్రం నా మనసుకు దగ్గరయ్యిందో నాకు ఇంకా అర్థం కాలేదు. వెంటనే ఒక ఆలోచన వచ్చింది. ఇదే విషయం నన్ను తీసుకొచ్చిన మిత్రుడితో పంచుకోవాలని అనిపించింది. పుస్తకంపై నున్న ఆ చిన్నారి గాంధర్వుడి చిత్రాన్ని నా మొబైల్ ఫోన్లో బంధించి అడుగులో అడుగు వేసుకుంటూ బయటకు వచ్చాను.

ఒక్కసారిగా గాలి వేగంగా వీయడం ప్రారంభించింది.

నేను కళ్ళకు చేతులను అడ్డుపెట్టుకొని, నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ నా స్నేహితుడి కోసం వెతకసాగాను.



గాలి వేగంగా వీస్తుండడం వల్లనేమో, పార్కులోని బెంచీలన్నీ ఖాళీ చేసేసి వెళ్లిపోతున్నారు జనాలు. ఇంతలోనే "ప్రకృతిలో ఏమిటీ విపరీత మార్పు" అని మనసు ఒక్క క్షణం సంకోచించింది. అడుగులో అడుగు వేసుకుంటూ నా స్నేహితుడి జాడ తెలుసుకొనేందుకు ప్రయత్నిస్తూ, గ్రంథాలయానికి ఆవలివైపునున్న రహదారి మార్గానికి చేరుకున్నాను.

రహదారి అంతా నిర్మానుష్యంగా ఉంది. దూరాన చెట్టు మీద ఉన్న గూడు నుండి పక్షికూనలు దీనంగా కేక పెడుతున్నాయి. నా కళ్ళు మాత్రం ఇంకా నా మిత్రుడి కోసమే వెతుకుతున్నాయి.

"ఏమోయ్ నేస్తం! ఏమైంది నీ అన్వేషణ..!" అంటూ ఒక చేయి నా భుజం మీద పడగానే వెనక్కి తిరిగి చూసాను. నా స్నేహితుడితో పాటు ఒక విదేశీ వనిత నాకు దర్శనమిచ్చింది.

నా స్నేహితుడి కళ్ళు నిర్మలంగా ఉన్నాయి. "ఈమె పేరు శకుంతల. నా స్నేహితురాలు" అని ఆమెను నాకు పరిచయం చేసాడు నా స్నేహితుడు.

ఓ విదేశీ వనిత ఓ భారతీయ స్త్రీ పేరు పెట్టుకోవడం నాకు ఆశ్చర్యమనిపించింది. ఇదే విషయం నా మిత్రుడిని అడిగాను. "ఈమె తండ్రి ఒక గొప్ప చిత్రకారుడు. అతనికి భారతీయ పురాణాల్లో శకుంతల పాత్ర అంటే ఎంతో ఇష్టం. అసలు ఆ పాత్ర ఇచ్చిన ప్రేరణతోనే చిత్రలేఖనం శ్రద్ధగా నేర్చుకొన్నాడు. తన కోర్సు పూర్తయ్యాక మొదట ఊహించి వేసిన చిత్రం కూడా దుశ్యంతుడి ప్రేయసైన శకుంతలదే. ఆ పాత్ర మీద ఉన్న అభిమానం తోటే తన కూతురికి కూడా ఆ పేరే పెట్టుకున్నాడు" అన్నాడు.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. ఒక పాత్ర ఇచ్చిన ప్రేరణతో ఒక వ్యక్తి చిత్రకారుడిగా మారాడా? సాహిత్యానికి, చిత్రలేఖనానికి కూడా అభినాభావ సంబంధం ఉంటుందా? కొన్ని గంటల క్రితం ఒక చిత్రం తనలోని కథకుడిని తట్టి లేపింది. అదే విధంగా ఒక విదేశీయుడిని ఒక పురాణ పాత్ర చిత్రకారుడు అయ్యేందుకు ప్రేరేపించింది. నా ఆలోచనలు అనంత కోటి లోకాలు దాటి, పాలపుంతల అంచులను తాకి ఒక మానసిక అలజడినే సృష్టిస్తున్నాయి.

ఏదేమైనా ఇది వేరే ప్రపంచమే. ఇది తనది కాని ప్రపంచం. కొందరికి మాత్రమే పరిమితమైన ప్రపంచం. యాంత్రికమైన బతుకులకు దూరంగా తమదైన స్వేచ్ఛను ధైర్యంగా పొందే ప్రపంచం.

నా హృదయంలో నుండి తన్నుకొస్తోంది భావుకత అవునో కాదో నాకు తెలియదు. దానికి సాహితీ పరిభాషలో ఇలాంటి ఒక పేరుంటుంది అని కూడా నాకు తెలియదు. అయినా నా హృదయంలో ఏదో తెలియని ప్రకాశవంతమైన వెలుగు ప్రజ్వరిల్లుతుందన్న మాట మాత్రం సత్యం. అది అనుభవైక్యం అయ్యాక.. ఇలా నా మనసులోని భావాలు దిగాంతాలు దాటసాగాయి.

ఈ అనుభవం పొందాక ఒక ప్రశ్న నా మిత్రుడిని అడగాలనిపించింది. తన దగ్గరకు వెళ్ళి "మిత్రమా! ఒకే ఒక ప్రశ్న అడుగుతాను. నాకర్ధమయ్యే భాషలోనే చెప్పాలి. నువ్వు అసలు రచయితగా ఎందుకు మారావు?" అన్నాను. వాడు చిన్న నవ్వు నవ్వి "చిత్రంగా ఉంది నీ ప్రశ్న. నేనెప్పుడూ ప్రొఫెషనల్ రైటర్ మాదిరిగా గొప్ప రచయితగా పేరు తెచ్చుకోవాలని, డబ్బు గడించాలని అనుకోలేదు. నాకు నచ్చిన అంశాలను అక్షరబద్ధం చేయాలన్న తృష్ణను తీర్చుకోవడం కోసం మాత్రమే రాయడం మొదలుపెట్టాను. అవి ఆదరణను పొందాయి. ప్రతి జీవితానికి ఏదో ఒక గమ్యం ఉంటుంది. రైతు ప్రేమగా సేద్యం చేసినప్పుడే ఫలాలను ఆనందంగా ఆస్వాదించగలడు. వ్యవసాయం చేయడం కూడా ఒక కళగా భావించినప్పుడే దాని మీద ఎంత అవాజ్యమైన ప్రేమ ఉందో తనకు తెలుస్తుంది. రచనా వ్యాసంగం కూడా అలాంటిదే. అదే కాదు.. ఏ కళ అయినా అంతే... మనతో మమేకమై మనలో ఇమిడిపోయినప్పుడే దాని విలువ మనకు తెలుస్తుంది.. మనకు మాత్రమే తెలుస్తుంది." అన్నాడు.

అతను చెప్పిన దాంట్లో ఎంత వాస్తవం ఉందో నాకు తెలియదు. అయితే తన మదిలోని భావాన్ని నిజాయితీగానే

నాతో పంచుకున్నాడని అనిపించింది.

వాతావరణంలో ప్రకంపనలు తగ్గినట్లు అనిపించింది. అంతటా ప్రశాంతత నెలకొంది. ఆకాశం వైపు తేరిపారా చూసాను. పావురాల గుంపు వేగంగా దూసుకుపోతోంది. వీటికి ఇంత శక్తి ఎలా వచ్చింది అని నాలో నేనే ప్రశ్నించుకున్నాను. ఇవ్వనీ ఊహకందని ప్రశ్నలే కదా? మళ్ళీ ప్రశ్నకు ప్రశ్న. ఒక కళారంగానికి లేదా రచనా రంగానికి చెందని వ్యక్తి, ఒక అంశాన్ని గురించి ఆలోచించాల్సి వస్తే ఈ మాదిరిగా ఆలోచిస్తాడన్న మాట. మళ్ళీ నాకు నేనే సర్ది చెప్పుకున్నాను. రోజువారీ పనుల్లో ఉన్నప్పుడు నేను ఈ విధంగా ఆలోచించగలనా? మళ్ళీ ఇదే ప్రశ్న..!

ఇలా మెదడు తొలిచేస్తుండగా, మళ్ళీ ఒక్కడినే మౌనంగా గ్రంథాలయంలోకి అడుగుపెట్టాను.

మళ్ళీ తైలవర్ణ చిత్రంలో నుండి తొంగి చూస్తున్న గాంధీ మహాత్ముడే స్వాగతం పలికాడు. ఒకసారి తదేకంగా చూసి ముందుకు కదిలాను. ఐతే ఈ సారి చెక్కల బీరువా వైపు కాకుండా, ఎడమ వైపు ఉన్న గదుల్లో ఏముందో చూద్దామని అటువైపు వెళ్ళాను. అక్కడ చిన్న పిల్లలు తెల్ల కాగితాలపై బొమ్మలు వేసుకుంటున్నారు. ఒక కుర్రాడు ఆజానుబాహుడైన ఒక సూపర్ మేన్ బొమ్మకు మెరుగులు దిద్దుతుంటే, మరో పిల్లాడు ఎలుగుబంటికి సూటు, బూటు వేసి ఒక కార్టూన్ బొమ్మను తదేకంగా గీస్తున్నాడు. నాలో నేనే ఒక చిరునవ్వు నవ్వుకున్నాను. అక్కడ ఇంకా చాలామంది చిన్న పిల్లలు ఉన్నారు. వారందరూ ఎలాంటి బొమ్మలు గీస్తున్నారో ఒకసారి పరిశీలనగా చూసి వేరొక గదిలోకి వెళ్లాను.

అక్కడ చూసిన ఒక సంఘటన నన్ను ఎంతలా మైమరిపించిందంటే.. మాటల్లో దానిని వర్ణించడం కష్టం.

నలుగురు వ్యక్తులు తీక్షణంగా, పరీక్షగా ఒక చిత్రాన్ని గమనిస్తున్నారు. ఆ చిత్రాన్ని ఒక చిన్నారి వేస్తుంది. రంగురంగుల కెరటాలు, ఆకాశంలో దేదీప్యమైన వెలుగులతో ప్రకాశిస్తున్న మెరుపులు... ఆ రెండింటికి మధ్య ఒక విచిత్రమైన జగత్తులాంటి ప్రదేశంలో చిక్కుకున్న నావ. ఆ నావలో ప్రయాణిస్తున్న ఓ అందమైన యువతి... ఆ చిత్రాన్ని అర్థం చేసుకోవడం నాలాంటి సామాన్యులకు సాధ్యమా? మళ్ళీ ఓ ప్రశ్న.

ఏదో తత్త్వం ఆ చిత్రంలో దాగి ఉంది.. అదే ఆ చిత్రం ప్రత్యేకత.. మనసులో అనుకున్నాను.

ఏదో పరిశీలనా శక్తి ఆ అమ్మాయి చేత ఆ చిత్రాన్ని గీయిస్తుంది.. మరో భావం మనసులో ఏర్పడింది.

ఇంతకు మించి... ఆ చిత్రాన్ని ఇంకెలా సమీక్షించవచ్చు.

ఇంత చిన్న వయసులో చేతులు, కాళ్లు లేకుండా ఈ పాప మంచి నైపుణ్యాన్ని ప్రదర్శించగలుగుతుంది...

కుంచెను తన పళ్లతో బిగించి పట్టి, ఎర్రటి పెదాలను వారధిగా చేసుకొని ఆ పాప అద్భుతంగా ఒక జీవితాన్నే ఆ చిత్రంలో ఆవిష్కరించింది.

బహుశా.. అసలు సిసలైన "మనసు గీసిన బొమ్మ" అంటే ఇదేనేమో!

# చలన జీవితం

- బూర్ల వేంకటేశ్వర్లు
9491598040



నేలలోకి చొచ్చుకు వెళ్ళే వేల వేళ్ళ
ప్రాణ నాడులకు స్పందనలనిస్తూ
చంటిపాప గుండె మీద తల్లిలా
చెవిఒగ్గి విత్తనాల్ని వింటుంది మట్టి

యుగయుగాల చలన శక్తిని
బొట్టు బొట్టులో ప్రవహింపజేస్తూ
నదిలో అశరీర వాణిలా
రోజుల పుటలు తిప్పుతాడు సూర్యుడు

ప్రశ్న జవాబుల కాలపత్రాల్నిరాసి
జేబులో పెడుతూ
ఏమీ ఎరుగని నదిలా
ఒంద్రు సారాన్ని ఒంటిలో నింపుతుంది చెట్టు

తనువుకూ గాలికీ మధ్యనున్న
సజీవ తంత్రీ లయల తాళాలు తీసి
వెదురు బెజ్జం నుండి రెక్క విప్పిన తుమ్మెదలా
కాలజ్ఞానాన్ని పాడుతుంది పిట్ట

జీవితాన్ని వినీ చదివీ రాసీ పాడే పాట
సజీవ రాగమౌతుంది

చేవ చచ్చినా సరే
వరుస వృక్షాల నిర్గమనాల మధ్య
చింతలేని చెట్టులా గాలితో కూడి
గలగలా గోదారిని వింటూ తలూపుతాడొకడు

చీకట్లు కమ్మినా సరే
పర్వత ముఖం మీద చందమామలా
నేల వెన్నెలను పట్టుకొని
జయ దరహాస వచనాలు చదువుతాడొకడు

విసిరికొట్టినా సరే
గాలి మీద పిట్టలా
కొత్త కావ్యాలు రాసి
కవిత్వసిరా సంతకం చేస్తాడొకడు

నిలువున కోసినా సరే
కొట్టుకుపోయిన తీరాన
చిరిగిపోయిన బతుకు పేలికలా
ఒంటిని కొమ్మకు ఆరేసుకొని
పతాకమెత్తి పాట పాడుతాడొకడు

తరువు కదలక
లోపలి పువ్వుకు ఊపిరాడదు
ఏరు పారక గుండెలో రాయి కరగదు
మనస్సు ఎదురేగక
బతుకు పంట ఏరోజూ పండదు
గతం వర్తమానంలో నిలవదు
భవిష్యత్తులో ఈ రోజు మొలవదు
బతుకును వింటూ చదువుతూ
రాస్తూ పాడుతూ
సాగిపోవడం జీవన కళ
జీవితమంతా చలనంలో జీవిస్తుంది
స్తబ్దత జీవితంలో ఇమడక మరణిస్తుంది

# దహనాన్ని మించిన విముక్తి లేదని చెప్పే "దహనం"

- సలీం
9849386327




ఈ మధ్యనే ప్రముఖ కవి, నవలా రచయిత ఐన సాగర్ శ్రీరామకవచం రాసిన నవల 'దహనం' చదవడం జరిగింది. నవల చదువుతున్నంతసేపు ఓ రకమైన సంభ్రమానికి లోనయ్యాను. ఎన్నెన్నో పాత్రలు... ఎంతో వైవిధ్యమైన జీవితాలు...వంద సంవత్సరాల కాలం.... ఇన్నిటిని సమర్థవంతంగా పోషించుకుంటూ అన్ని పాత్రలకూ రక్తమాంసాల్ని సమకూరుస్తూ, వాళ్ళ మానసిక సంఘర్షణలను చిత్రిస్తూ ఓ అద్భుతమైన నవలని సృష్టించడం చాలా అరుదైన విషయం. తెలుగు సాహిత్యంలో అతి కొత్తిమంది రచయితలకు మాత్రమే సాధ్యమైన సంక్లిష్ట ప్రక్రియ ఇది.

తెలుగు సాహిత్యంలో మంచి నవలలు రావడం లేదనే అపప్రధ ఈ మధ్య బహుళ ప్రచారంలో ఉంది. ఇదెంత సత్యదూరమో కొన్ని నవలలు చదివినపుడు అవగతమౌతుంది. సాహిత్యకారులు మంచి నవలలే కాదు కొండకచో గొప్ప నవలల్ని కూడా సృజిస్తున్నారు. ఎటొచ్చీ వాటికి రావాల్సినంత గుర్తింపు రాకపోవడానికి కారణం ఇప్పటి సమాజంలో నెలకొని ఉన్న పరిస్థితులే అన్పిస్తుంది. నవలలు చదివే ఓపిక, సమయం లేకపోవడం ఓ కారణం. కొంతమంది రచయితలకు తాము రాసిన నవలల్ని ఎలా ప్రమోట్ చేసుకోవాలో తెలియకపోవటం మరో కారణం, సాహితీవేత్తల్లో కూడా ముఠాలు ఏర్పడటం వల్ల ఏ ముఠాకు చెందని నవలాకారుడి సృజన మరుగున పడిపోవడం ఇంకో కారణం.

ఇదంతా ఎందుకు చెప్పాల్సి వచ్చిందంటే ఈ మధ్యనే ప్రముఖ కవి, నవలా రచయిత ఐన సాగర్ శ్రీరామకవచం రాసిన నవల 'దహనం' చదవడం జరిగింది. నవల చదువుతున్నంతసేపు ఓ రకమైన సంభ్రమానికి లోనయ్యాను. ఎన్నెన్నో పాత్రలు... ఎంతో వైవిధ్యమైన జీవితాలు...వంద సంవత్సరాల కాలం.... ఇన్నిటిని సమర్థవంతంగా పోషించుకుంటూ అన్ని పాత్రలకూ రక్తమాంసాల్ని సమకూరుస్తూ, వాళ్ళ మానసిక సంఘర్షణలను చిత్రిస్తూ ఓ అద్భుతమైన నవలని సృష్టించడం చాలా అరుదైన విషయం. తెలుగు సాహిత్యంలో అతి కొత్తిమంది రచయితలకు మాత్రమే సాధ్యమైన సంక్లిష్ట ప్రక్రియ ఇది.

ఈ నవల్లోని కథాంశం మూడు తరాల జీవితమంత విస్తృతమైంది. అప్పన్నశాస్త్రి, అతని తమ్ముడు శ్రీరాములు, అక్క లక్ష్మమ్మ... అప్పన్న శాస్త్రికి ఆరుగురు మగపిల్లలు... నలుగురు ఆడపిల్లలు. వీళ్ళ జీవితాల్లో జరిగిన సంఘటనల సమాహారం ఈ నవల. ఇందులో స్వాతంత్ర్య పోరాటం గురించిన ప్రస్తావన... తెనాలి బాంబు కేసు... తీవ్రవాద కార్యకలాపాలు.... మొదటి, రెండవ ప్రపంచ యుద్ధాలు.... గాంధీజీ దక్షిణాఫ్రికాలో చేసిన పోరాటాలు....తిలక్..... మాండలే జైలు... హోమ్ రూల్ లీగ్ ఉద్యమం..... నాన్ బ్రాహ్మణోద్యమం..... ఆ రోజుల్లో క్రిస్టియానిటీలోకి జరిగిన మతమార్పిళ్ళు.... ఎంకిపాటలు రాసిన నండూరి సుబ్బారావు... బసవరాజు అప్పారావు..... అబ్బో.... ఇలా చెప్పుకుంటూ పోతే చాలా వాటి ప్రస్తావన గురించి చెప్పాల్సి వస్తుంది. మహాగ్రంథ:గా రూపుదిద్దుకోడానికి అవసరమైనంత కథని సంక్షిప్తీకరించి చెప్పటంలోనే ఈ రచయిత ప్రతిభ ద్యోతకమవుతుంది.

ఈ నవలకు దహనం అని పేరెందుకు పెట్టాల్సి వచ్చింది? సాగర్ నవలల పేర్లన్నీ ప్రత్యేకంగానే ఉంటాయి. అతను రాసిన

మిగతా నవలల పేర్లు మూలుగు, అవస్థ, యాతన, మగత. ఇది చూడగానే అర్థమయ్యే విషయం ఏమిటంటే ఈ రచయిత మూస రచయిత కాదు. చాలా భిన్నమైన రచయిత. వైవిధ్యాన్ని ఇష్టపడే రచయిత. 'శ్మశానంలో శవాలు తగలబడ్తూనే ఉన్నాయి' అంటూ నవల మొదలవుతుంది. అప్పన్న శవాన్ని చెంచులు దహనం చేయటంతో నవల ముగుస్తుంది. చివరాఖరికి బాగా ముసలివాళ్ళయిపోయిన అనంతుడూ పేరిందేవి ' ఈ మధ్య ఎవరికీ సాయంకాలాలు కన్పించడం లేదు' అనే వాక్యంతో నవల పరిసమాప్తమవుతుంది. ఏ జీవితమైనా దహనంతోనే ముగుస్తుంది. పుట్టుక ఎలా ఉన్నా, జీవితం ఎన్ని మలుపులు తిరిగినా చివరి మజిలీ మాత్రం దహనవాటికే. ఈ మధ్యలో కూడా ఎన్ని రకాల దహనాలో... అప్పన్న శాస్త్రి శేషమ్మ శరీరంలో తన కోర్కెని దహనం చేసుకుంటాడు. దహించే మంగి అవయవాలనుంచి విముక్తి పొందిన శ్రీరాములు సన్యాసిగా మారి తన భౌతిక వాంఛల్ని దహనం చేసుకుంటాడు. రామినాయుడు ధనాశలో దగ్ధమవుతుంటాడు. రెడ్డి పిల్ల సుజాతను ప్రేమించిన రమణయ్య కలెక్టర్ కూతుళ్ళను చూడగానే సుజాతని తన హృదయంలో దహనం చేసేసి స్వార్థంతో దహించుకుపోతుంటాడు. ప్రతిదీ దహనమే. దేన్లోనో ఒకదానిలో దగ్ధం కానిదే మనిషికి మనుగడ లేదు. అందుకే ఈ నవల దహనం...

> **ఇది చూడగానే అర్థమయ్యే విషయం ఏమిటంటే ఈ రచయిత మూస రచయిత కాదు. చాలా భిన్నమైన రచయిత. వైవిధ్యాన్ని ఇష్టపడే రచయిత.**

ఈ రచయిత స్వతహాగా కవి కాబట్టి కొన్ని చోట్ల భాష కవితాత్మకమై రసాత్మకమై మార్మికమై అలరిస్తుంది. ఉదాహరణకు "వెదురు వనాలని దాటి, వనాల్లో దాగున్న వేణువు నడకలని దాటి, ఒకే ఒక ముఖం దాచుకున్న దుఃఖపు ప్రాచినతలు దాటి – అంతటా ఓ సామీప్యత, ఓ సామూహికత, ఎవరికి వారు దాచుకుంటున్న అస్తిత్వ మహాస్తిత్వం. కొంచె నడకేగా దాచుకోవటమెందుకన్న యవనికల రహస్యాంతర భాషల్లోంచి, శిల్పమనోవేదనల్లోంచి, నానాపరిమళ దేహచ్ఛాయల్లోంచి ఓ భ్రమర భాషని దాటి....." ఇలా సాగుతుంది.

పార్వతి కలల్లోకి సిల్వియా రావడం... మూగపిల్లలు అలివేలు భ్రమరాంబ మాట్లాడుకోవడం..... పార్వతి తన్ను తాను వెంకటప్పయ్యలా భావించి ఆలోచించడం... ఆమె యింకొకరి దేహంలా, యింకొకరి ఆలోచనలా ప్రవహించడం.... ఇదంతా అధివాస్తవిక రచనావిన్యాసం.

ఈ నవల్లో కొన్ని చోట్ల మాటల ముత్యాలు రాలి పడ్డాయి. ఈ రచయిత జీవితానుభవంలోంచి, లోతైన ఆలోచనలోంచి వెలువడిన ఎన్నో మాటల ముత్యాల్లోంచి కొన్నిటినైనా ప్రస్తావించకుండా ఉండలేని పరిస్థితి....

"దొరలు ఒకచేత్తో బైబిల్‌తోనూ, యింకో చేత్తో తుపాకితోనూ మనదేశంలోకి వచ్చారు. దొరలు పోయినా మన చేతికి మతమూ, తుపాకులు యిచ్చేసే పోతారు."

"తల్లిని ద్వేషించే కొడుకు సహజంగానే యిలా తీవ్రవాద ధోరణికి అలవాటు పడ్తారు."

"చావబోయేముందు ఆడది చాలా ఆనందిస్తుందని తనకి ఎవరూ యింతకు ముందు చెప్పలేదు"

"చాలిమందికి ఏం పోగొట్టుకున్నారో తెల్సినంతగా ఏది కావాలో తెలియదు. ఒకవేళ తెల్సినా అంతా అయిపోయే ఉంటుంది".

"ఒక వ్యవస్థీకృత సమాజం బలహీనంగా వున్నప్పుడు ప్రజలు క్రమంగా సంఘటితమై, బలవంతులై, బలహీన సమాజాన్ని తోసి, దాని స్థానంలో మరో బలమైన సమాజ నిర్మాణానికి వుత్సాహం చూపిస్తారు. త్యాగాలు చేస్తారు. తిరుగుబాట్లు జరుపుతారు".

"కాలం వేగంగా పయనించేకొద్దీ మానవుల్లో అన్వేషణ బాహ్యంగా పెరిగినంతగా అంతర్గతంగా వుండదు."

1967 ప్రాంతంలో ప్రముఖ కన్నడ రచయిత, జ్ఞానపీఠ అవార్డు గ్రహీత యు. ఆర్. అనంత మూర్తి రాసిన 'సంస్కార' నవల గురించి ఇక్కడ ప్రస్తావించడం అవసరం. సంస్కార నవలకూ దహనం నవలకూ కొన్ని పోలికలున్నాయి. రెండింటిలోనూ నవలా నేపథ్యం బ్రాహ్మణ జీవితాలే. సంస్కార నవల్లో కన్నడ మధ్వ బ్రాహ్మల అగ్రహారంలో జరిగిన కథని చిత్రిస్తే దహనం నవల్లో ఆంధ్ర రాష్ట్రంలోని ఒంగోలు, దాని పరిసర ప్రాంతాల బ్రాహ్మల జీవితాల చిత్రణ కన్పిస్తుంది. రెండింటిలో మూల ధాతువు ఒక్కటే. బ్రాహ్మణ సాంప్రదాయాలు ఆచారాలు... వాటిని ధిక్కరించే మానవ బలహీనతలు..

సంస్కార నవల్లో నారాయణప్ప మధ్వ బ్రాహ్మడు. అగ్రహారంలో నివసిస్తూనే దైవాన్ని, ఆచారాల్ని ధిక్కరిస్తూ నిరసిస్తూ బతుకుతాడు. పచ్చి తాగుబోతు... చేపల్ని

వండించుకుని తింటాడు. బ్రాహ్మణ్యాన్ని నాశనం చేస్తాను అంటూ బాహాటంగా ప్రకటించుకుంటాడు. దహనం నవల్లో కూడా కొంతమంది బ్రాహ్మణ కులస్థుల్లో ఉన్న దురలవాట్ల ప్రస్తావన చాలా చోట్ల కన్పిస్తుంది. ఇందులోని ముఖ్యపాత్రల్లో ఒకరైన అప్పన్న శాస్త్రి గంజాయి దమ్ముకి అలవాటు పడ్డాడు. అతని తమ్ముడు శ్రీరాములు భార్య పార్వతి మాదిగ కులస్తురాలైన మంగితో కలిసి సారాయి తాగుతుంది.

**దహనం నవల్లో రచయిత ఎక్కడా అసహజమైన, తర్కానికందని సంఘటనలను ఎన్నుకోలేదు. అక్షరాల్లో బంధించిన జీవితాలు సహజాతిసహజంగా మన కళ్ళముందు ఆవిష్కరించబడ్డాయి.**

సంస్కార నవల్లో నారాయణప్పకు చంద్రి అనే శూద్ర స్త్రీతో శారీరక సంబంధం ఉంటుంది. నారాయణప్ప శవానికి సంస్కారం చేయడానికి అగ్రహారంలోని బ్రాహ్మలు ముందుకు రాకపోతే ఈ చంద్రినే ఓ ముస్లిం అతనితో గుట్టుగా శవదహన కార్యక్రమం కానిస్తుంది. అగ్రహారంలోకెల్లా గొప్ప పండితుడూ, పరమ నిష్ఠాగరిష్టుడూ అయిన ప్రాణేశాచార్య మానవసహజమైన బలహీనతకు లొంగిపోయి తన రోగిష్ఠి భార్య దగ్గిర దొరకని సుఖాన్ని చంద్రి పొందులో అనుభవించి ఆత్మశోధన చేసుకుంటూ ఎటో వెళ్ళిపోతాడు. అతను చివరికి చంద్రితో ఉండిపోవడానికి నిర్ణయించుకుంటాడు.

దహనం నవల్లో రచయిత అనంతమూర్తి కన్నా ఓ అడుగు ముందుకేశాడు. అప్పన్న శాస్త్రికి దిబ్బన్న భార్య శేషమ్మతో అక్రమ సంబంధం ఉంటుంది. దిబ్బన్న అసమర్థుడు. అతనే భార్యను అప్పన్న శాస్త్రి వద్దకు పంపిస్తూ ఉంటాడు. ఆ సంబంధం వల్ల అబ్బన్న పుడ్తాడు. శ్రీరాములుకి శూద్ర స్త్రీ మంగితో ఉన్న అక్రమ సంబంధం వల్ల రమణయ్య పుడ్తాడు. రమణయ్య అచ్చం శ్రీరాములు పోలికల్తో ఉంటాడు. అప్పన్నశాస్త్రి భార్య కామేశ్వరి తమ భూముల్ని కాపాడుకునే ఉద్దేశంతో మరిది శ్రీరాములుతో అక్రమ సంబంధం పెట్టుకోడానికి సిద్ధపడి, పార్వతితో అతనికి శోభనం జరక్కుండా అటకాయిస్తుంది. శ్రీ రాములు సన్యాసుల్లో కలిసిపోయాక అతని భార్య పార్వతిని లోబర్చుకోడానికి అప్పన్న శాస్త్రి విఫల ప్రయత్నం చేస్తాడు. అప్పన్న శాస్త్రి పెద్ద కొడుకు అనంతుడు సంజీవుడు పెళ్ళాడిన పేరిందేవితో సంబంధం పెట్టుకుని చివరికి ఆమెనే పెళ్ళి చేసుకుంటాడు.

ఒకచోట పార్వతి ఇలా అంటుంది. "ఆమెని (మంగిని) నరక కూపంలోకి దింపిన మీ బ్రాహ్మణీకం బతికినా ఒహటే చచ్చినా ఒహటే" అని.

ఇవన్నీ పచ్చి నిజాలు. చాలా కుటుంబాల్లో చాలా వూళ్ళలో మన కంటబడే చేదు నిజాలు. దీనికి బ్రాహ్మణ సమాజం ఏ మాత్రం మినహాయింపు కాదని చెప్పిన రచయిత నిజాయితీకి, మనో నిబ్బరానికి జోహార్లు.

సంస్కార నవలతో పోలిస్తే దహనం నవల చాలా విషయాల్లో మరింత మెరుగ్గా కన్పిస్తుంది. సంస్కార నవల్లో చాలా సంఘటనలు, పాత్ర చిత్రణ సహజత్వానికి దూరంగా, తర్క రహితంగా కన్పిస్తాయి. ఇందులోని ముఖ్య పాత్ర ప్రాణేశాచార్య వైరుధ్యానికి పరాకాష్టలా దర్శనమిస్తాడు. చివరికి రచయిత ఏం చెప్పదల్చుకున్నాడో స్పష్టంగా అర్థం కాదు. శాస్త్రాల్ని నమ్మేవారు, ఆచారాల్ని పాటించేవారు కూడా కొన్నిసార్లు బలహీనతలకు లొంగిపోతారు. అని చెప్పటం నవల ఉద్దేశమై ఉంటుంది. ఈ నవల్లో స్త్రీ పాత్రలన్నీ స్వంత వ్యక్తిత్వం లేకుండా ప్రవర్తిస్తుంటాయి.

కానీ దహనం నవల్లో రచయిత ఎక్కడా అసహజమైన, తర్కానికందని సంఘటనలను ఎన్నుకోలేదు. అక్షరాల్లో బంధించిన జీవితాలు సహజాతిసహజంగా మన కళ్ళముందు ఆవిష్కరించబడ్డాయి. బలహీనతలకు కులాలు మతాలతో ప్రమేయం ఉండదు. ఏ మనిషికైనా కొన్ని బలాలు, మరికొన్ని బలహీనతలు సహజం. ఈ నవల్లో కూడా శ్రీరాముల్ని శూద్ర స్త్రీ మంగి ఆకర్షిస్తుంది. రచయితకు మంగి పాత్ర పట్ల చాలా ఇష్టం ఉన్నట్టు కొన్ని చోట్ల ద్యోతకమౌతుంది.

మంగి శ్రీరాముల్ని తల్చుకుని "ఆడ్ని వెధవ అన్నానా.... యింతకంటే ఎన్ని తిట్టినానో నా బట్టని....." అంటూ తన నోటికి సహజంగా అన్పించే బూతుల్ని కలిపి మాట్లాడినపుడు పార్వతి ఇలా అనుకొంటుంది. 'ఇలా స్వచ్ఛంగా, నిర్మలంగా, ధైర్యంగా తనలాంటి స్త్రీలు అందునా మధ్యతరగతి ముసుగులోని మార్మిక స్త్రీలు ఎదగగలరా? ఆమె భాష ఎంత అందంగా ఉంది? కవులు కూడా కళ్ళు తేలేసే ఈ జీవభాష తనింత వరకు విని ఎరుగదు.'

సంస్కార నవల వెలువడిన వెంటనే అక్కడి బ్రాహ్మణ సమాజాల్లో అలజడి చెలరేగింది. బ్రాహ్మణ్యాన్ని మంటగలిపినందుకు ఉవ్వెత్తున నిరసనలు వెల్లువెత్తాయి. మరి అంతకన్నా నిజాయతీగా నిర్భీతితో రాసిన దహనం నవల

# స్వాతంత్ర్యం

- దుప్పాడ రామకృష్ణ నాయుడు
8790408525



ఎండమావి జీవితంలో
ఎంగిలాకులేరుకునే దీనుల
ఎండిన ప్రేగుల ఆకలి అరుపులు
నిత్యం నా చెవిలో మారుమ్రోగుతుంటే

చీకటి నిండిన బ్రతుకులలో
వేకువ కోసం వేచియున్న
అనాధల దీనమైన చూపులు
ప్రతిక్షణం నా కళ్ళ ముందు కదలాడుతుంటే

కూడు కోసం కూలి కోసం
గూడు కోసం నిలువ నీడ కోసం
వీధికెక్కిన శ్రమజీవుల వీపులపై మూపులపై
ఖాకీల లాఠీలు విరామమెరుగక కరాళ నృత్యం చేస్తుంటే

బ్రతుకు కోసం బాగుకోసం
స్వేచ్ఛా సమతల కోసం
బయటికొచ్చిన బాలల అబలల
మానప్రాణాలను హరిస్తున్న మానవమృగాలు
రేయింబవళ్ళు వీధుల్లో విచ్చల విడిగా విహరిస్తుంటే
నా దేశం స్వతంత్రించిందని ఎలా నమ్మను?
ఈ దేశం గణతంత్రమని ఎలా చెప్పను?
ఆకలి కడుపులతో ఆరుబైట నిదురించే

చినిగిన గుడ్డలతో చిల్లుబడ్డ బ్రతుకులైన
అనాథలు అభాగ్యులు
దగాపడ్డ దీనులు సమాజం వెలివేసిన హీనులున్న
నా దేశానికి స్వతంత్రం లేదంటాను
వచ్చిన స్వతంత్రం ఈ దేశానికి కాదంటాను

ప్రజాస్వామ్యంలో ప్రజలంతా భాగస్వాములైతే
అందలమెక్కి కూర్చున్న అభివృద్ధి అట్టడుగు
అభాగ్యునికి అందని నాడు
సంపదకు భాగస్వాములు కాని
ఈ అభాగ్యులను ప్రజలు కాదనుకోవాలా?
లేక, ఈ దేశంలో ప్రజాస్వామ్యం లేదనుకోవాలా?

దేశమంటే మనుషులైతే
దేశమెప్పుడో స్వతంత్రిస్తే
ఈ దీనుల కెందుకు లేదు స్వతంత్రం?
స్వతంత్రం లేని ఈ దీనులను మనుషులు
కాదునుకోవాలా?
లేక ఈ దేశానికి స్వతంత్రం లేదనుకోవాలా?
ఏమనుకోవాలి?
నేనేమనుకోవాలి?

---

గురించి ఎవరూ ఎందుకు పట్టించుకోలేదు? తమ బ్రాహ్మణ కులంలో ఉన్న కుళ్ళుని కళ్ళకు కట్టినట్టు చూపించాడు రచయిత అని మిన్నకుండిపోయారా? లేదు. నిజమెప్పుడూ నిష్ఠూరంగానే ఉంటుంది. అది నిజమే అయినా నిప్పుని తొక్కినట్టు మనిషి చిందులేయడం సహజం. మరి ఈ నవల విషయంలో ఎందుకింత ఉదాశీనత చోటు చేసుకుంది?

నాకు ఒక్కటే కారణం కన్పిస్తోంది. ఈ నవలని ఎక్కువమంది చదవలేదు. ఇది ఎవరికి చేరాలో వారికి చేరలేదు. విమర్శకుల దృష్టికి రాలేదు. ఈ నవల మీద ప్రముఖ పత్రికల్లో సమీక్షలు వచ్చిన దాఖలాలు కూడా లేవు. ఇది పేరున్న పత్రికల్లో సీరియల్‌గా రాలేదు. అన్నిటికీ మించి రచయితకు వెన్నుదన్నుగా ఏ కూటమి లేదు. ఓ మంచి నవల సహజ మరణం పొందడానికి ఇంతకన్నా బలమైన కారణాలు ఏం కావాలి?

పైకి శుచిగా శుభ్రంగా కన్పించే బ్రాహ్మణకులాన్ని, శూద్రులు ఎదురుపడినపుడల్లా అసింటా అసింటా అంటూ వాళ్ళని విదిలించుకునే బ్రాహ్మల జీవితాల్ని మేడిపండు విప్పి చూపినట్టు చూపించిన రచయిత అభినందనీయుడు. ఈ నవల్లో పాత్రలకు శ్రీరామకవచం ఇంటి పేరుగా గల బ్రాహ్మల్ని ఎన్నుకోవడంలోనే రచయిత చాలామంది విమర్శకుల నోళ్ళు తెర్చుకోకముందే మూయించేశాడని నాకనిపిస్తోంది.

నిజమే. దహనాన్ని మించిన మరో విముక్తి ఏముంది? వంద సంవత్సరాల క్రితం నాటి సమాజ స్థితిగతుల్ని కళ్ళకు కట్టేలా చిత్రీకరిస్తూ, చిరకాలం నిల్చిపోయే నవల రాసిన సాగర్ శ్రీరామకవచం అన్ని రకాలుగా అభినందనీయుడు.

## ఆకాంక్ష

- గంజాం భ్రమరాంబ
9949932918



స్వాతంత్ర్య దినోత్సవ
శుభ తరుణంలో
మదిలో మెదిలిన ఆకాంక్షలెన్నో..

నీపై రాలిన చినుకు
నీవెవరా అని ఆరాతీయదు
నిన్ను స్పృశించిన చిరుగాలి
నీ కులాన్ని ఆరాతీయదు
నిన్ను చల్లగా తాకిన వెన్నెల
నీ స్థాయి ని ఆరాతీయదు

కానీ
నీ చెమట చుక్కకు
సరియైన ఖరీదు దొరకక..
నడిబజారులో పడి దొర్లుతోంది
నీ చల్లబడిన రక్తం
కుటుంబ అవసరాలు తీర్చలేక
పేదరికం లో మగ్గిపోతుంది
అవినీతి రుచిమరిగిన
ఖరీదైన దుస్తులు
పెద్దపెద్ద కార్లలో షికారు చేస్తూ
పేదరికాన్ని తొలగించేందుకు
శక్తి.. ఆసక్తి.. లేక
పేదలనే తుదిముట్టిస్తున్నారు.

కులాల చిచ్చు రేపి
తాపీగా తాము చలికాచుకుంటున్నారు
ప్రజల మధ్య పెరుగుతున్న
అసమానతలు చూసి
ఇక తమ పని సులువని
వేడుక చూస్తున్నారు.

అసమానతలు...
కొందరి స్వార్థపరుల ఆలోచనలకు
నాట్యం చేస్తున్న వికృత రూపాలు
అమాయకులను దోచుకుంటున్న
చాంధసవాదాలు.

స్త్రీల కన్నీటి ప్రవాహాలకు
ఆనకట్టలు కడుతున్న
కారణ భూతాలు
మేధో వలసలకు
పచ్చజెండా ఊపుతున్న
శిధిల సమాధులు

అందుకే...
రండి..
మన త్రివర్ణ పతాకం సాక్షిగా..
అసమానతలు రూపుమాపుదాం
ఏ రూపంలో ఉన్నా పాతరేద్దాం
సమసమాజ స్థాపనకు
మనమే ఒక తొలి అడుగు వేద్దాం
నిజమైన స్వాతంత్ర్య స్ఫూర్తితో
మన హృదయాలను వెలగనిద్దాం

## నానీలు

- కె. సరస్వతి
8106391580



పెద బాలశిక్ష
ఎక్కడో దాగుంది
రేపటి పౌరుల్లారా
వెతికి పట్టుకోండి

అందం, నటన ఉన్నా
అవకాశం దక్కటం లేదు
వెండితెర తారలు
చిన్న తెరని కాజేశారు

అన్యోన్య దాంపత్య కథకు
ప్రథమ బహుమతి
అద్భుతంగా రాశాడు
ఇల్లాల్ని బూట్లతో తన్నుతూ

కుల మత జాతి దుర్గంధం
దానికి అంటలేదు
పరిమళిస్తూనే వుంది
సాహిత్య పుష్పం

విందు భోజనంలో
కమ్మని రుచులన్నీ అమ్మ
చివరి పెరుగన్నం మాత్రం
నాన్న

# ఎరమ్రట్టి ఇటుకల ఇల్లు



- డా మౌని
9397048771

'నాయనో! రాత్రి కురిసిన వానకు మన ఇల్లు ఉరుస్తూనే ఉందిగదా. నా పుస్తకాలు బాగా తడిసిపోయాయి. నేను బడికి పోను అయ్యోరు కొడతాడు' అంటూ నాల్గవ తరగతి చదువుతున్న పెద్దకొడుకు మునిమోహనమూర్తి తండ్రికి ఫిర్యాదు చేసాడు. ఇంతలో మూడవ తరగతి చదువుతున్న రెండవ కొడుకు రత్నమునికుమార్ కూడా తన పుస్తకాల గుడ్డసంచి పూర్తిగా తడిచిపోయిందంటూ అన్న మాటలకు వంత పాడాడు. మొత్తానికి ఇద్దరు పిల్లలు బడికి వెళ్ళడానికి భయపడుతున్నారు. వెళ్తే తడిసిన తమ పుస్తకాలను చూస్తే అయ్యవారి దగ్గర దెబ్బలు తినాల్సివస్తుందని. అదీ నిజమేకదా! ఇప్పటికీ పల్లెల్లో తమ కులదేవర పేరుతో తమ బిడ్డలకు ఆ పేరులోని ఏదో ఒక పదం వచ్చేటుగా పేర్లు పెట్టడం ఆనవాయితీగా ఉంది. ఇక్కడ వెంకటముని పేరులో ముని, అలాగే అతని కొడుకుల పేర్లలో మునిమోహన్‌మూర్తిలోను, రత్నమునికుమార్‌లోను ముని తప్పక చోటుచేసుకోవడం వారికి తమ కులదేవత మునీశ్వరుడు మీదున్న భక్తిప్రపత్తులే. ఇలాగే మిగత కులదేవతలు అంటే గుర్రప్పస్వామి, రెడ్డెమ్మ, నాగాలమ్మలను కొలిచే వారు ఆ దేవతల పేర్లు వచ్చేవిధంగా తమ బిడ్డలకు పెట్టుకోవడం సమాజంలో ఒక సంప్రదాయంగా మిగిలిపోయింది.

బడికి వెళ్ళనంటున్న కొడుకుల మాటలు వింటున్న చిన్నపాటి రైతు వెంకటమునికి వారికి జవాబు ఏమి చెప్పాలో తోచలేదు. వర్షాకాలం వచ్చినప్పుడల్లా బిడ్డలతో, వచ్చేఏడు కొత్త ఇల్లు కట్టుకుందాము అంటూనే పిల్లలకు ఆశపెడుతూనే ఉన్నాడు. కాని అతని కోరిక తీరని ఆశగా మిగిలిపోతా ఉంది. అయితే తండ్రి చెప్పే మాటలకు ఆ ఇద్దరు పిల్లలు కలలు కంటూనేఉన్నారు ఎంతో ఆశగా. పెద్ద పిల్లోడు మునిమోహనమూర్తి అయితే బడిలో నాలుగు మాటలు మాట్లాడితే అందులో రెండు మాటలు కొత్తగా కట్టబోయే ఇంటిని గూర్చే చెప్పేవాడు. రెండవవాడు రత్నమునికుమార్ అయితే ఇంకా కొంచెం గొప్పగా చెప్పేవాడు. ' మా నాయన! కొత్త ఇల్లు కడితే అందులో నాకొక గది, మా అన్నకు ఒక గది ఇస్తాడంట చదువుకోవడానికి' అంటు కళ్లు రెపరెపలాడిస్తూ ఆనందంతో చెప్పేవాడు. తోటి పిల్లలు కూడా వారి మాటల్ని

ఎంతో ఆశ్చర్యంగా వినేవారు. ఎందుకంటే ఇంచుమించు పల్లెల్లో అందరి ఇళ్లు బోదతో కప్పిన మట్టి ఇండ్లే, పూరిండ్లే. కొందరివైతే నాలుగు అంకణాల తాటి ఆకుల ఇండ్లు, పూరి గుడిసెలే ఎక్కువగా ఉండేవి. అయితే ఆ ఊరిలో నలుగురు ఐదుగురు పెద్ద రైతుల ఇండ్లు తప్పిస్తే అందరివి సాదాసీదా పూరిండ్లే. పెద్దరైతుల్లో కోదండనాయుడు పేరున్న పెద్దరైతు. పదెకరాల మాగాణి సొంతదారుడు. పదిమంది పనివాళ్లతో వ్యవసాయం చేస్తూ, ఊరిలో అధికారం చెలాయిస్తుంటాడు. ఆయన పొలాలెప్పుడు వరిపైరు, చెరకు తోటలతో కళకళలాడుతుండేవి.



వెంకటమునికి ఊరిబయట మెట్టనేలలో రెండెకరాల చేను ఉంది. అది వాళ్ల తాతల నుంచి సంక్రమించిన ఆస్తి. ఆ చేనులో చిన్న నీళ్ల బావి తప్పితే పెద్ద నీటి ఆధారం లేదు. వర్షం కురిస్తేనే పంటలు, లేకుంటే లేదు. అందుకే ఆ చేనులో వేరుశెనగ పంటతో పాటు కందిచెట్లు, అలసందులు, పెసలు, ఆనపకాయ, గుమ్మడిపాదులు వేసుకుని ఫలసాయం పొందుతూ కుటుంబాన్ని పోషించుకుంటూనే చిన్నాచితక వ్యాపారం చేసుకుంటున్నాడు. వెంకటముని, భార్య రాజమ్మ కూడా ఇద్దరి పిల్లల్ని ప్రేమగా పెంచుకుంటూ ఎంతో అన్యోన్యంగా కాపురం చేసుకుంటూ కుటుంబాన్ని ఇద్దరూ కలిసి పదిమందిలో గౌరవంగా లాక్కొస్తున్నారు.

వెంకటముని చేను ఎర్రమట్టి చేను. ఆ ఇలాకాలో అలాంటి మట్టి ఉండే చేన్లు లేవనే చెప్పాలి. ఊరిలో జనాలు, చుట్టుపక్కల వాళ్లు ఉగాది, దీపావళి సంక్రాంతి పండుగలకు ఇండ్లు అలికి, ముగ్గులు పెట్టేసమయంలో వెంకటముని చేనులోని ఎర్రమట్టిని గంపలుగంపలుగా తీసుకుని వెళ్ళేవారు. ఆ ఎర్రమట్టిని గోడలకు అలంకరణ చేసేవారు. అలాగే ద్వారబంధరాలకు, అరుగులు అలికేందుకు ఉపయోగించుకునేవారు. తమ చేలోని ఎర్రమట్టి ఎంత తీసుకెళ్ళినా వెంకటముని, రాజమ్మలు వారిని పల్లెత్తి ఒక మాటకూడా అనేవాళ్లు కాదు. తమ చేనులోని ఎర్రమట్టి పదిమందికి పండుగలకు, పబ్బాలకు ఉపయోగపడుతున్నందుకు ఆనందంతో మురిసిపోయేవారు. అది వారి మంచి మనసుకు వన్నె తెచ్చేది. ఆ చేనులో, తాతల కాలం నాటి నుంచి పెరిగి పెద్దవైన యాభై పెద్దపెద్ద చెట్లు ఏపుగా పెరిగి దృఢంగా కనిపించేవి.

ఒకసారి ఊరిపెద్ద కోదండనాయుడు కన్ను వెంకటముని ఎర్రమట్టి చేనుమీద పడింది. కోదండనాయుడి ఈ ఆలోచనకు, ఆయన మోచేతి నీళ్లు తాగే చెంచాగాళ్లు ఆయన మాటకు వంతపాడటం అలవాటే కదా. దానిఫలితం ఒకరోజు కోదండనాయుడు, వెంకటముని తన ఇంటికి పిలిపించుకున్నాడు. 'వెంకటముని ఈ ఎర్రమట్టిచేను నాకు ఇచ్చేస్తే నీకు స్వర్ణముకి వంకకాడ అడవిబాటకు దగ్గరుండే రెండెకరాల చేను నీకు ఇచ్చేస్తాను. ఇప్పుడు నీ పొలంలో ఎలిపైర్లు మాత్రం చేస్తున్నావు. నేనిచ్చే పొలంలో చిన్నపాటి బోరు వేసుకుని చక్కగా సేద్యం చేసుకోవచ్చు. సాలుకు రెండుమూడు పంటలు పండించుకోవచ్చు' అని చెబుతుండగా వెంకటముని అడ్డు తగిలిలాడు. 'లేదన్నా ఎట్టి పరిస్థితిల్లోను నా చేనును మార్చుకునేది లేదు. అది మా తాత ముత్తాతల ఆస్తి. ఆ ఎర్రమట్టి చేను అంటే ప్రాణం అన్నా. వేరే విషయం ఏదైనా ఉంటే మాట్లాడండి. చేను విషయం మాత్రం వద్దు' అంటు లేచి బయటకు వచ్చేశాడు వెంకటముని, ఇంకా అక్కడ ఉంటే వాళ్ళందరు కలిసి బలవంతం చేసి తన మనసును మార్చేస్తారేమో అని.

కోదండనాయుడికి ఆయన చెంచాగాళ్లకు మతి పోయినట్లు అయ్యింది. వెంకటముని పట్టుదల, మొండితనం ఊరిలో వాళ్ళందరికి తెలిసిందే. తాను ఒకరి సొత్తు ఆశించడు. తనకున్నంతలో తన బ్రతుకు బతికేస్తాడు. కనుక వెంకటమునితో ఈ విషయం మాట్లాడటం సుద్దదండుగ అని అనుకున్నారు. కోదండనాయుడు మనసు మాత్రం ఈసారి అవకాశం వస్తే వెంకటమునిని జారిపోనీకుండా వలేసి పట్టాలనుకున్నాడు. ఎందుకంటే కోదండనాయుడి చూపు ఆ చేనుకంటే కూడా అందులో నూరేళ్లు పెరిగిన ఆ పెద్దచెట్లు మీదనే ఉంది.

ఆ రోజు రాత్రి వెంకటమునికి రాజమ్మకు కంటిమీద కునుకే లేదు. కొత్త ఇళ్లు కట్టుకోవాలన్నా ఆశ, కోదండనాయుడు మాటలతో వారిలో తెలియని భయం చోటుచేసుకుంది. ఎలాగైన తమచేలోని ఎర్రమట్టితో ఇటుకలు కోయించి, నాలుగైదు పెద్ద చెట్ల కలపతో ఇంటికి కావాల్సిన వస్తు సామాగ్రిని చేయించుకుని ఇల్లు పూర్తిచేసుకోవాలని, తమబిడ్డల కళ్లలో ఆనందం చూడాలన్నదే వారి జీవితఆశయం. అయినా అన్నింటికి ఆ దేవుడే ఉన్నాడని ఆయనపై భారం వేసి ఆలోచనలో మునిగిపోయారు ఆ భార్యాభర్తలు.



పోయిన ఉగాది పండుగకు కర్నాటక ప్రాంతం ములబాగల్ నుంచి, బంగారు తిరుపతి నుంచి రాజమ్మ దూరపు బంధువులు తమ ఇంటికి రావడం, ఆటవిడుపుగా అందరూ కలిసి ఎర్రమట్టి చేనుకాడ వంటావార్పు చేసుకుని అక్కడనే ఆనందంగా పండుగ చేసుకోవడం జరిగింది. ఆ సమయంలో మాటల్లో మాటగా ములబాగల్ నుంచి వచ్చిన రాజమ్మ చిన్నాన్న వెంకటమునితో ' అబ్బా! వెంకటముని నీ చేల్లో మట్టి ఎర్రగా మినమిన మెరుస్తాఉందయ్యా, ఈ మట్టితోగాని ఇటుకలు చేస్తే మంగుళూరు పెంకులు కూడా వీటి ముందు దిగదుడుపే. ఈ సారి ఇటుకసూల (బట్టీ) వేసుకో, నాలుగైదు పెద్దచెట్లు కొట్టించి ఆ కలపతో ఇంటికి కావాల్సిన తలుపులు, ద్వార బంధరాలు, కిటికీలు చేసుకుంటే నీ ఇల్లు మైసూరు మహరాజు ఇల్లులాగా ఉంటుందప్ప' అంటు నవ్వుతూ మాట్లాడాడు. అందుకు వెంకటముని ' మామా! మేము కూడా మీరు చెప్పినట్లుగా చిన్నపాటి ఇల్లు కట్టుకోవాలని ఆశతో ఉన్నాము. అయితే సమయం కలిసిరాలేదు. వర్షాకాలం వస్తే భయపడాల్సి వస్తోంది. బిడ్డలు అయితే ఎప్పుడు కొత్త ఇల్లు కడతావు నాయినా! అని ఒకటేగా పోరుపెడుతున్నారు. వాళ్ళకు జవాబు చెప్పలేక నేను, మీ కూతురు సిగ్గుపడుతున్నాము. ఎలాగైతేనేమి ఈ ఏడు మా చేలోని ఎర్రమట్టితో ఇటుకలు కాల్చి ఇల్లుకట్టుకుంటాం మామ. అప్పుడు మీరందరు గృహప్రవేశానికి తప్పక రావాల్సిందే.' అంటుంటే రాజమ్మ కూడా 'చిన్నాయన పిన్నమ్మ మీరందరు కలిసి రాకుంటే ఎట్లా, మీరు వస్తేనే గృహప్రవేశం' అని నవ్వుతుంటే, పక్కనేఉన్న ఇద్దరు కొడుకుల ముఖాలు ఆనందంతో వెలిగిపోయాయి. అప్పుడే కొత్త ఇల్లు కట్టుకున్నంత సంబరంతో.

ఆ తర్వాత ఒక నెలలోపులోనే కొత్త ఇల్లు కట్టే విషయంగా భార్యాభర్తలు యజ్ఞమే చేశారు. చేనులో ఇటుకలు కోయించేందుకు పుత్తూరు నుంచి పనివాళ్లను రప్పించుకున్నారు. వాళ్లకు చేనులోనే గుడారాలు వేయించి బియ్యం, పప్పులు భోజనవసతి కల్పించారు. ఇటుకలు కోసేపని జోరుగా జరుగుతూ ఉంది. మరోవైపు నాలుగు పెద్ద చెట్లు కొట్టించారు. మిగతా చెట్లను అలాగే ఉంచేశారు. ఆ నాలుగు చెట్లను నరికేస్తుంటే భార్యాభర్తలకు దు:ఖం పొంగి వచ్చింది. అయ్యో ఇవి మా తాతల కాలం నాటి చెట్లే, వాటిని వాళ్లు కన్నబిడ్డలాగా పెంచారే. ఇప్పుడు కొట్టాల్సి వచ్చిందే అని బాధపడిపోయారు.

ఇటుకలు కోసేపని పూర్తి అయిపోయింది, ఇటుక సూల తయారైపోయింది. ఒక మంచి ముహూర్తం చూసి ఇటుక బట్టీలో ఎర్రమట్టి ఇటుకలు కాల్చేందుకు నిప్పురగిలించారు. కర్పూరం, సాంబ్రాణి, ఊదుబత్తులు వెలిగించి అగ్నిదేవుడ్ని పూజించి టెంకాయ కొట్టారు. తర్వాత పండ్లు, ప్రసాదం అందరికీ పంచిపెట్టారు. ఇటుక బట్టీ మెల్లమెల్లగా రగులుతూ దట్టమైన పొగతో అంతా నిండిపోయింది. చూస్తున్న వెంకటముని రాజమ్మల మనసులుకూడా ఆనందంతో పొంగిపోయాయి.

వారం తర్వాత ఇటుక బట్టీ నుంచి ఇటుక రాళ్లను దించి చూశారు. ఆశ్చర్యానికి అంతేలేకుండా పోయింది. ఆ ఇటుకరాళ్లు ఎర్రగా మినమిన మెరుస్తూ, నున్నగా మంగుళూరు పెంకులకు ధీటుగా ఉన్నాయి. భార్యాభర్తలు ఆనందంతో ఒకరిముఖాలు ఒకరు చూసుకున్నారు. తాము పడ్డ మూడునెలల శ్రమ ఆ ఇటుకలు చూడటంతో ఆ కష్టం క్షణంలో కొట్టుకుపోయినట్లయ్యింది. మనసులు ఎంతో తేలికపడి, దూదిపింజల్లాగాలి లో తేలిపోయాయి.

వెంకటముని చేలో కోసిన ఎర్రమట్టి ఇటుకల గూర్చి ఊరంతా తెలిసిపోయింది. ఇంతకమునుపు ఇలాంటి ఇటుకలు ఆ చుట్టు పక్కల తయారుచేయలేదు. మామూలు ఇటుకలకు, ఈ ఎర్రమట్టితో చేసిన ఇటుకలకు రంగులోనే కాదు గట్టితనంలో కూడా చాలా తేడా కనిపించింది. ఈ ఎర్రమట్టి ఇటుకలు ప్రత్యేకమైనవి అని, మంగుళూరు ఇటుకలకు సమంగా గట్టిగా ఉన్నాయని ఊరిలో వారు చెప్పుకోవడం కోదండనాయుడి చెవిలో పడింది. కోదండనాయుడు తన వంది మాగధుల తోటి వెంకటముని ఎర్రమట్టి చేనుకాడికి వచ్చాడు. ఆ ఇటుకలను చూసి నిజంగానే ఆశ్చర్యపోయాడు. అయినా అతని మనసు పొరలో ఎక్కడో తనకు తెలియకనే ముల్లు గుచ్చుకున్నట్లయ్యింది.



ఇంతలో వర్షాకాలం మొదలైంది. ఇంటిపని మొదలు పెట్టాలనుకున్న వెంకటమునికి వర్షం అడ్డంకిగా మారింది. ఈ మధ్యలో గుత్తకు వేరే రైతు నుంచి పొలం తీసుకుని వ్యవసాయం చేస్తున్న తన అన్న కొడుకు మునిరత్నం ఆ పొలంలోని బావిలో కరెంటు మోటారు వర్షానికి నీళ్ళలో మునిగిపోతుంటే దాన్ని బయటకు తీయాలని బావిలో దిగిన అతనికి షాక్ కొట్టింది. ఆ సమయంలో పైనుంచి చూస్తున్న వెంకటముని, అన్న కొడుకుని కాపాడాలనే తొందరతో వేరే ఆలోచన లేకుండా, బావిలోకి దిగేందుకు పైపు పట్టుకుని జారడం, కరెంటు మోటారుపై పడటం, మోటారుపైన అడ్డంగా బిగించిన గాలి తీసే చీలలు వెంకటముని కాళ్లలో గుచ్చుకోవడంతో బావిలో పడిపోవడం అంతా క్షణాల్లో జరిగిపోయింది. ఒకరికిద్దరు అలా బావిలో పడిపోవడంతో చుట్టుపక్కల వాళ్లు ఆదరాబాదరా వచ్చి వాళ్లను కాపాడగలిగారు. ఇద్దర్నీ రక్షించినప్పటికి, వారికి కాళ్లలో నెత్తురుగాయాలు అవడం చేత, శరీరానికి శీతలం తగిలి వాయువు రావడంతో ఇద్దరు అపస్మారక స్థితిలో పడిపోయారు. చివరకు ప్రత్యేక వైద్యం అందించేందుకు పట్టణానికి తీసుకెళ్ళాల్సి వచ్చింది. పట్నంలోని ఆసుపత్రికి దగ్గరగా ఒక గదిని అద్దెకు తీసుకుని ఆరునెలలు వైద్యం చేయించాల్సి వచ్చింది. ఎలాగైతేనేమి ఇద్దరు ప్రాణాపాయస్థితి నుంచి గట్టెక్కారు.

తన భర్త వెంకటమునికి, తన బావ కొడుకు మునిరత్నానికి ఇలా జరగడంతో రాజమ్మకు ముఖం కళతప్పిపోయింది. వాళ్లు బ్రతికితే చాలు అనుకుంది. ఎర్రమట్టి ఇటుకల ఇల్లు కట్టేమాట పక్కన పెట్టేసింది. భార్యాబిడ్డల్ని చూస్తున్న వెంకటమునికి నోటివెంట మాట రావడం లేదు. ఆరునెలలుగా వైద్యానికి అయినఖర్చు వేలు దాటిపోయి లక్షకు దగ్గరయ్యింది. ఇక కొత్తఇల్లు కట్టే విషయం ఏమి ఆలోచించగలడు? అందుకే తన మనసును గట్టి చేసుకున్నాడు. కుటుంబ పరిస్థితులు అస్తవ్యస్తమయ్యాయి. తన మనసు గాజుపాత్రలాగా మరీ పెలుసుగా తయారైంది. ఇప్పుడు చిన్నపాటి గాయం తగిలినా భల్లున పగిలిపోవడం ఖాయం అని నిర్ధారణ చేసుకున్నాడు.

ఈ పరిస్థితుల్లో, వెంకటముని మనసు ఇలా ఊగిసలాడుతున్న సమయంలో కోదండనాయుడు ఆసుపత్రికి వచ్చి వెంకటమునిని పరామర్శించాడు. వెంకటముని తన ముఖాన్ని పైకెత్తి ఆయనవైపు చూడలేక పోయాడు. ఇదే అదునుగా భావించిన కోదండనాయుడు తన నోరు విప్పాడు. 'వెంకటముని నీ జాతకంలో ఇలా జరగాలని దేవుడు రాసిపెట్టినాడో ఏమో లేకుంటే ఎర్రమట్టి ఇటుకలతో ఇల్లు కట్టుకోవాలనుకున్న నీ ఆశ ఇలా అయిపోతుందా? అందుకే అనుభవజ్ఞులు అంటుంటారు ఇల్లుకట్టిచూడు పెళ్ళిచేసిచూడు అని. ఇవి అందరికి అచ్చిరాని పనులు రా'. ఇప్పుడు అయ్యిందేదో అయిపోయింది. ఇక ఆలోచించి లాభం లేదు. నీ వైద్యానికి ఇంటిఖర్చులకు అయిన అప్పులు తడిసి మోపెడు అయ్యాయికదా. వాటిని ఎలా తీరుస్తావు. గమ్మున ఉండేకొద్దీ వడ్డీలకు వడ్డీలు పెరిగి తిరిగి కట్టలేక నిండామునిగిపోతావు. ఈ స్థితిలో నీ భార్యా పిల్లలు పస్తులతో ఉండటం నీకిష్టమా? ఆలోచించుకో ఇకనైన నా మాట విని ఆ ఎర్రమట్టి ఇటుకల సూల, కొయ్యవస్తు సామాగ్రి యావత్తు నాకు ఇచ్చేయి దాంతో నా చిన్నకూతురికి మా జాగాలో ఇల్లు కట్టించి ఇస్తాను. నీ అప్పు పూర్తిగా నేను కట్టేస్తాను. నీవు కట్టాలనుకున్న కొత్త

# వేకువ తీరాన

- పక్కి రవీంద్రనాథ్
9440364486



సందడి చల్లారింది
తలుపులు పెనవేసుకున్నాయి
ఎయిర్ కండిషనర్
శీత పరిమళమై గదంతా వ్యాపించింది
దీపం రెప్ప వాల్చింది
ఇంటరి తనాన్ని కప్పుకున్నాను
జ్ఞాపకాలు కుట్టడం మొదలుపెట్టాయి
మగత రానని మారాం చేస్తోంది
నిశ్శబ్దపు రొద
లేచి కూర్చున్న చెవులు
గడియారపు ముల్లు
ఒకటే కబుర్లు
కుంటిదయిన కాలం
ఒంటిపై పాకుతున్న అసహనం
ఆవలింతలు ఆహ్వానిస్తున్నా
నిద్ర నిద్ర నటిస్తోంది
నాకింద పరుపు
కొండచిలువ దేహాన్ని తలపిస్తోంది
దిండు దిశలు మార్చుకుంటోంది
దూరంగా రైలు కూసింది
రంగుల రెక్కలాడిస్తూ బాల్యం వాలింది
పొత్తిళ్లలో పొదివి పట్టుకుని
పవిటను కప్పి
నాచే వెన్నెల తాగిస్తూ అమ్మ
ఉక్కపోతకే ఊపిరాడనీయకుండా
విజ్ఞాన వింజామరలు వీస్తూ నాన్న
రామదాసును శృతి చేసుకుంటూ
రాత్రుళ్లను రాగరంజితం చేస్తూ
తాతయ్య
కథల రాసులు పోసో
కళ్లకు లేపనం పూసో
అతల, వితల, సుతల
తలాతల సువర్లోకాలను
ఆవిష్కరిస్తూ నానమ్మ
నన్ను జోల గుర్రమెక్కించి
చీకటి మబ్బుల దాటించి
కలల వనంలోకి
నడిపించిన నిన్నటి తరం
గుక్క పట్టి ఏడ్చినపుడు
నన్ను ఊరడించిన అమృత స్వరం
పూతోటలో పసితనం ఊరేగిన జాడలు
పట్టుకుందామంటే ఎగిరిపోతున్న
సీతాకోక చిలుకలు
కీచురాళ్ల కచేరీతో వర్తమానం నా ముందు
కళ్లు తెరుచుకుంది
చీకటి గుట్టలోంచి మిణుగురొకటి
నాన్న పటం ముందు వాలింది
అల్మరాలోంచి నవ్వుతూ నాన్న
పుస్తక బాహువులతో నన్ను చేరబిలిచాడు
విశాల విశ్వాన్ని తెరిచే
తాళపు చెవులను నా చేతిలో వుంచాడు
తూరుపు గూటిలో వెలుతురు కూసింది
వేకువ కువకువలతో రాత్రి తోక ముడిచింది

---

ఇల్లు ఉత్తరోత్తర వీలుచూసుకుని తీరిగ్గా కట్టుకోవచ్చు.' అంటూ వెంకటమునివైపు అధికార దర్పంతో ఒక చూపు చూసి ఉత్తర్వులు వేస్తున్నట్లుగా కదిలిపోయాడు. వెంకటముని కోదండనాయుడు వెళ్తున్న వైపే కళ్లు ఆర్పకుండా చూస్తూ ఉండిపోయాడు.

ఆ రోజు రాత్రి వెంకటముని , రాజమ్మ పిల్లలకు తమ కల చెదిరిపోతున్నట్లు అనిపించింది. వెంకటమునికైతే అప్పుల వాళ్లు కాకుల్లా భార్యాపిల్లల మీద పడి పొడుస్తున్నట్లు అనిపించింది. దు:ఖం తన్నుకొచ్చింది. వెంకటమునికి నిదురతేలిపోయింది. ఒక నిర్ణయానికి వచ్చాడు. 'తమ ఇన్నాళ్ల కష్టం ఫలసాయం మాత్రమే కదా పోయింది. నా ఎర్రమట్టి చేనుమాత్రం నాకు మిగిలిందికదా. అనుకున్నాడు. నోటికాడ దాక వచ్చిన కూడు నేలపాలవ్వడమంటే ఇదేనేమో. ఇల్లు కట్టుకోవడం చిన్నపాటి రైతులకు, కూలీలకు అందని ద్రాక్షేనేమో. ఇది బడాబాబులకు మాత్రమే ఉన్న హక్కేనేమో? అని అనుకుంటూ చివరకు ఎర్రమట్టి ఇటుకల ఇల్లు కట్టుకోలేక పోయానే అని అనుకుంటుంటే వెంకటముని కళ్లనుండి బొట్లుబొట్లుగా కన్నీళ్లు రాలిపడుతున్నాయి. వెంకటముని మనసుని గట్టి చేసుకున్నాడు. అంతే భార్య రాజమ్మ ఒడిలో తలపెట్టి , ఇద్దరి బిడ్డల్ని తన పక్కన చెరోవైపు పడుకోబెట్టుకుని వాళ్లపై చేతులేసుకుని నిద్రపోయాడు. ఆ నిద్రలో ఒక కల. ఆ కలలో 'ఎర్రమట్టి ఇటుకల ఇల్లు కొత్తగా కట్టినట్లు అందంగా రంగురంగులతో మెరిసిపోతూ, అందనంత ఎత్తులో వారికి కనిపిస్తోంది.



## చూపులు

- జడా సుబ్బారావు
9849031587

చూపులు
సూదుల్లా గుచ్చుతాయంటే
ఏమో అనుకున్నాను
శూలాల్లా పొడుస్తాయంటే
విని ఊరుకున్నాను

♦

మాట నోటికి రాకమునుపే
పెదాలు పదాల్ని వదలక ముందే
గుండెల్ని నిలువునా కోసే
పదునైన ఆయుధమేదో
చూపుగా మారి
దేహాన్ని
చుట్టేసుకున్నప్పుడే తెలిసింది
చూపులంటే
అంతుచిక్కని అగాధాలని
ఆకలి నిండిన అగ్నిగోళాలని

♦

కరుణమో కాఠిన్యమో
అనురాగమో అనుమానమో
బాధాతప్త నిలయమో
బాధ్యతల వలయమో
పేరేదైతేనేం
కంటినుండి వదిలిన బాణంలా
చూపెప్పుడూ
సూటిగా గుండెల్లో దిగిపోతుంది
అణువణువునూ పట్టి కుదిపేస్తుంది

♦

ఏవో నిర్వచనాలిచ్చి
సరిపుచ్చుకుంటాం
ఏవో భావాలకు అద్ది
పొద్దుపుచ్చుతుంటాం
ఎన్ని చెప్పుకున్నా...
శతకోటి భావాల్ని ఒలికించడానికి
కంటిరెప్పల్ని దాటే పనిలో
చూపెప్పుడూ
చలనమే చంచలమే
నిరంతర సంచలనమే...

---

## నేనూ-తను

- నెల్లూరు వెంకటలక్ష్మి
9491632232

ప్రణయకావ్యపు మాటున దాగిన ప్రళయగాయం
రణమందున పోరాడి గాయమయేది నేనేగా..
వున్నెల నవ్వులు విసిరిన మందహాసం మాటున
దాగిన వివక్ష వలయంలో ఓలలాడేది నేనేగా...
అతడి అంతరంగపు కడిలిలో దాగిన
విద్వేషపు అలజడుల సవ్వడుల్లో ఎగసి పడేది నేనేగా..
నులివెచ్చని ఆత్మీయ స్పర్శలో అంతరార్థం
ధృతరాష్ట్ర కౌగిలని స్ఫురించేది నాకేగా..
అజాను బాహుని విశ్వరూపం వెనక దాగిన
రాక్షసరూపం కనుగొన్నది నేనేగా..
కొంటెగా విసిరిన ఓర చూపుల కళ్ళ వెనకదాగిన
కోరచూపులకు బలయ్యేది నేనేగా..
జీవిత చట్రపు పద్మవ్యూహంలో చిక్కి
బయటకు రాలేక నలుగుతున్నది నేనేగా..
..........



ఇన్ని తెలిసిన నేను
బంధాలకు బంధీనై
మనస్సాక్షిని చంపుకొని
మూడు ముళ్ళు ఏడడుగులంటూ
నాకు నేనే...నన్ను నేనే..నాలో నేనై
బంధీఖానాలో జీవిస్తూ...

# శిఖామణి కవితా దర్శనం

- అవధానుల మణిబాబు
99481 79437.




*ఒక అగ్రశ్రేణి కవిగా రూపొందిన తరువాత కూడా కవి చేసిన కృషి ఎంత లోతుగా, ఎన్నెన్ని కోణాలలో మూల్యాంకన చేయబడుతుంది? ఎన్నెన్ని పరీక్షలను ఎదుర్కోవాల్సి వస్తుంది అనేది తెలుసుకోడానికి, వీలైతే ఒకింత మెలుకువలో ఉండడానికి - ఎదగాలనుకునే కవుల కోసం అలాగే, మూలాలను, పరిణామక్రమాన్ని, కవి ప్రకటించిన భావాల వెనుక కార్య కారణ సంబంధాన్ని, గతకాలపు సువిశాల సారస్వతంలో సరూప అభివ్యక్తుల ఉటంకింపుల్ని,. ఇన్ని నిర్వహించాల్సిన బాధ్యత తెలియజెప్పడానికి - తయారుకావాలనుకునే విమర్శకులకోసం ఈ ముద్రణ ఎంతైనా అవసరం.*

ఓ ఇష్టమైన కవి తాలూకు కవిత్వాన్ని ఉద్దేశ్యపూర్వకంగా పక్కనపెట్టి, ఆ కవిత్వంపై వెలువడిన విశ్లేషణాత్మక వ్యాసాన్ని సమీక్షించడం ఓ ప్రత్యేక సందర్భం. కాసేపు మనం'శిఖామణి' కవిత్వాన్ని గురించి నరసింహమూర్తి మనసుతో మాట్లాడుకోబోతున్నాం. ఇలా, కనువిందు చేస్తున్న కవితా పంక్తుల మోహంలో పడకుండా, మనదైన **Ego interference** కు గురికాకుండా మూర్తి విశ్లేషణపైనే దృష్టిసారించడం కొంత కష్టమైన పనేనేమో!

పుస్తకానికి సంబంధించిన ప్రాథమిక విషయాల్లోకి వస్తే, వందల మందికి చల్లదనాన్ని, మాధుర్యాన్ని పంచగల పానీయం గాఢమైన, సాంద్రమైన ఎసెన్స్ గా చిన్న సీసాలో ఇమిడిపోయినట్లు, అంతవరకూ వెలువడిన శిఖామణి కవిత్వంపై 2008లో డా. ఉపాధ్యాయుల అప్పల నరసింహమూర్తి చేసిన సమగ్ర విశ్లేషణను ముప్పై పేజీలలో 'బాధానందం' అనే శీర్షికతో అందించారు. పత్రికలూ, ఇతర గ్రంథాలలో ఇప్పటికే సంక్షిప్తరూపంలో అచ్చయినా, పూర్తిరూపం ఇపుడు 'కావ్య సంజీవి' పేరిట ముద్రించి నరసింహమూర్తి సహధర్మచారిణి శ్రీమతి నరసమ్మగార్కి అంకితమిచ్చారు. మూర్తి మరణించినపుడు శిఖామణి రాసిన నివాళి వ్యాసాన్ని పుస్తకంలో చేర్చడం ప్రత్యేకంగా ప్రస్తావించవలసిన విషయం.

వ్యాసం చదవడం పూర్తిచేసాక మనకు తెలిసే మొదటివిషయం దీని ముద్రణ ద్వారా శిఖామణికో, వారి కవిత్వానికో ఇపుడు లభించే లేదా లభించవలసిన అదనపు ప్రయోజనమేమీ లేదు. అయితే, ఒక అగ్రశ్రేణి కవిగా రూపొందిన తరువాత కూడా కవి చేసిన కృషి ఎంత లోతుగా, ఎన్నెన్ని కోణాలలో మూల్యాంకన చేయబడుతుంది? ఎన్నెన్ని పరీక్షలను ఎదుర్కోవాల్సి వస్తుంది అనేది తెలుసుకోడానికి, వీలైతే ఒకింత మెలుకువలో ఉండడానికి - ఎదగాలనుకునే కవుల కోసం అలాగే, మూలాలను, పరిణామక్రమాన్ని, కవి ప్రకటించిన భావాల వెనుక కార్య కారణ సంబంధాన్ని, గతకాలపు సువిశాల సారస్వతంలో సరూప అభివ్యక్తుల ఉటంకింపుల్ని,. ఇన్ని నిర్వహించాల్సిన బాధ్యత తెలియజెప్పడానికి - తయారుకావాలనుకునే విమర్శకులకోసం ఈ ముద్రణ ఎంతైనా అవసరం.

నిజానికి నరసింహమూర్తి, కవిత్వాన్ని గూర్చి తన అభిప్రాయాలను, కవిలోకానికి ఇవ్వదలచిన నిర్దేశాలను అందించడానికి మాధ్యమంగా శిఖామణి కవిత్వాన్ని ఎంచుకున్నారు. అందుకే మొదటి పేజీల్లోనే " కవి బంగారు పాళీతో రాసాడా? ఇనుప పాళీతో రాసాడా? అన్నది ముఖ్యం కాదు. అభిశప్త సమాజానికి అండదండగా నిలిచాడా, లేడా? అన్నదే ముఖ్యం. అగాధ మానవతా సముద్రాల గరరేలో

నిక్షిప్తమైన బడబాగ్ని శిఖలతో ఉవ్వెత్తున ఎగసిన ఉత్తాల తరంగమై, ఉజ్జ్వల కాంతిపుంజ ఉన్నిద్ర కంఠమై, ఉపక్రమోపసంహారాలు లేని ఉదాత్త స్వప్నంగా నిలిచాడా లేడా? అన్నది ముఖ్యం" – కవిత్వపు **Aims & Objectives** ని తెలియజెప్పే ప్రయత్నమిది.

**వచన కవిత్వంలో అతి నవ్యమైన అభివ్యక్తి నైపుణ్యం, అత్యంత సహజమైన వస్తు విస్తరణ శిఖామణికి ఒక ప్రత్యేకస్థానాన్ని అందించినా, అతని కవితా స్వభావంలో మినీ కవితా శిల్పం ఒదగలేక పోయింది అని సూటిగా స్పష్టం చేస్తారు.**

తరువాత దశలో, కవి ఏ ఏ పథాలలో పయనిస్తాడు, అతడిని ఏవి అనుసరిస్తాయి, వాటి బాహ్యాంతర స్వరూపాల భేదం నుండి తానేం నేర్చుకుంటాడు? ఇన్నిటి గురించి మనలో ప్రశ్నలు లేవనెత్తుతారు. వాటన్నిటితో శిఖామణి కవిత్వాన్ని బేరీజు వేసి "కవిత్వ తత్వాన్ని ఆకళించుకోగల నూత్నదర్శనం కారణంగా శిఖామణి కవిత్వం కవిత్వ ప్రియులకు మహా బాధానందాన్ని అందిస్తుంది" అని ప్రకటిస్తారు. ఈ పుస్తకానికి మూర్తి పెట్టుకొన్న పేరు వెనుక కారణం ఇది.

వ్యాసనిర్మాణంలోని ఒక నిర్దిష్టమైన శిల్పం మనకు కనిపిస్తుంది. ముందుగా సార్వకాలికము, సార్వజనీనము అయిన విషయాలను తెలియజేసి, అక్కడినుండి శిఖామణి కవిత్వంలోకి ప్రవేశించి, ప్రశంసించి సాధికారికంగా వారి పరిశీలనలను మన ముందుంచుతారు.

"ఉత్తమోత్తమ కవులకు అవసరమైన సంయమనం, సమగ్రత అనే లక్షణాలు శిఖామణిలో ఒక పాలు తక్కువని చెప్పకతప్పదు. ఈ లోపం కూడా శిఖామణిలో ఒక అత్యంత ఆకర్షణీయమైన స ృజనబీజంగా పరిణమించింది" – ఉండాల్సిన కొన్ని లక్షణాలు లేవని చర్చ మొదలుపెట్టి అది ఆమోదయోగ్యమే అని రూఢి చేసి ముగించడం ఇక్కడ వ్యాసకర్త ప్రదర్శించిన టెక్నిక్.

తరువాతి సోపానంగా శిఖామణి కవిత్వానికి ప్రేరణదాయకంగా నిలిచిన సాహిత్యంతో వారి కవిత్వాన్ని తులనాత్మక సంసర్గం జరపుతారు. ఈ దశలో మనం చదువుతున్నది వ్యాసమైనా, వాక్య నిర్మాణం కవిత్వాన్ని చదువుతున్న అనుభూతిని కలిగిస్తుంది. వేదన ఏ రూపంలో ఉన్నా కవిత్వం దానిని మన కళ్ళ ముందు నిలుపగలదనే సత్యానికి శ్రీ శ్రీ తో పాటు శిఖామణి కూడా సాక్ష్యం పలుకుతాడు. ఈ శతాబ్దం నాదని ప్రకటించిన కవితో సారూప్యం కవి పొందిన ఉన్నత గౌరవం. చాలాచోట్ల సుదీర్ఘ వాక్యాలు – చివరికి ఏం తేలుస్తారో అనే ఉత్సుకతను కలిగిస్తాయి. మరోచోట రెండు దశాబ్దాల నుంచి తెలుగు కవిత్వ పాఠకులకు తారసిల్లిన తరితీపు శిఖామణి. ఎంత హృద్యమైన వాక్యమిది.

ఇతర కవుల ప్రభావాలు, వైరి సమాసాలు, పద ప్రయోగాలు కవితా నిర్మాణంలో అలసట, అనవధానం చోటుచేసుకున్న సందర్భాలను సోదాహరణంగా సూచిస్తూ, కొన్ని బలహీనతలకు, కొన్ని ప్రలోభాలు ఉంటాయి. వాటిని గుర్తించినపుడు కవి ఇంకా సంయమనశీలి కాగలడు, సమగ్రతను సాధించగలడు – అంటూ వారి కవిత్వాన్ని సాధనంగా చేసుకుని మనకు సూచన చేస్తారు. వచన కవిత్వంలో అతి నవ్యమైన అభివ్యక్తి నైపుణ్యం, అత్యంత సహజమైన వస్తు విస్తరణ శిఖామణికి ఒక ప్రత్యేకస్థానాన్ని అందించినా, అతని కవితా స్వభావంలో మినీ కవితా శిల్పం ఒదగలేక పోయింది అని సూటిగా స్పష్టం చేస్తారు.

తరువాత అభివ్యక్తి తీవ్రతలో వచ్చిన క్రమానుగత మార్పుని, ఔచిత్య భూమిక నాశ్రయించి నిర్వహించడంలో వచ్చిన పరిణతిని నర్మగర్భంగా తెలియజేస్తారు. అయితే ఈ ప్రతిపాదనలన్నిటికీ ముందే " వేసవి నీటి పాయలో ఉండే ఒక సారళ్యం, ఒక తళ తళ ఆ అభివ్యక్తిలో కనిపిస్తాయి" అని కవిపై తనకు గల శాశ్వత అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తారు.

చివరకు, శిఖామణి కవిత్వమర్మాన్ని ప్రకటిస్తారు. " శిఖామణికి పూలను ప్రేమించడం తెలుసు, అందుకే అతని మాటలు పరిమళిస్తాయి, అతడు కవిత్వపు ఇండుబకాయతో వరదగా పారే భాషకు తేటదనం తెస్తాడు, సరళము ప్రసన్న గంభీరము అయిన కావ్య భాషాపరిచయంతో పాటు భావకవులు, అభ్యుదయ కవులు ఉపయోగించిన ఆధునిక ప్రామాణిక భాషను అనుసరించిన వాడీ కవి.

సభ్యత, సంస్కారాలతో పాటు, శబ్ద సంస్కారం కుడా ఉన్నవాడు ఈ కవి.

కవిత్వానికి నలుపూ తెలుపూ అంటూ ఉండదు. చదరంగం గళ్ళలా శిఖామణి కవిత్వంలో ఎత్తు ఎత్తుకీ గడి మారినా ఏదో ఒక కొత్త వ్యూహం కదులుతూ మనల్ని కదిలిస్తుంది లాంటి **statements** తో శిఖామణి కవిత్వం తాలూకు సమగ్ర చిత్రాన్ని మనకు సాక్షాత్కరింపజేసి ముగిస్తారు.

❋

# వాళ్ళూ వీళ్ళూ ఒకటైనారు

- పొత్తూరి సుబ్బారావు
9490751681



గతంలో అంటుకున్న చెదును
తుడిచిపారేశాం
వర్తమానంలో ఆవరించిన భయాన్ని
అవతలికి నెట్టేశాం
భవిష్యత్తుకు భరోసా ఇచ్చారని
నెత్తికెక్కించుకున్నాం
కడిగిన ముత్యాలమని వాళ్ళంటే
మేమెలా కాదనగలం
ఐదూళ్ళిస్తే చాలన్న పాండవులను గెంటేసిన
కౌరవులం వంటి వాళ్ళము కాదు మేము
ఐదేళ్ళు అవకాశమిస్తే చాలు
లెక్కలేనంతగా అద్భుతాలు సృష్టిస్తామంటే
ఓట్ల హారాన్ని వాళ్ళ మెడనిండా దిగేశాం
నోట్లతో ఇల్లంతా అలంకరించుకున్నారన్న
సత్యాన్ని దిగమింగుకున్నాం
పెద్దనోట్ల రద్దుకు వాళ్ళేమాత్రం చలించకున్నా
ఒళ్ళంతా హూనమయ్యేలా
మేము క్యూలో నిలబడ్డాం
ఇక చాలు వాళ్ళ పాలనని
వాళ్ళని కాదని వీళ్ళని ఎన్నుకుంటే
వాళ్ళూ వీళ్ళూ ఒకటైనారు
ప్రయోగశాలలో
రసాయనాల రంగును మార్చటం
కష్టసాధ్యము కావచ్చు
రాజకీయాల్లో రంగులు మార్చటం మాత్రం
నాయకులకు సులభసాధ్యమే
పైకి విసిరిన వస్తువు క్రిందేపడటం
న్యూటన్ భూమ్యాకర్షణ సిద్ధాంతమయితే
అటూ ఇటూ మారుతుండే నాయకుల వైనం
ఏ శాస్త్రజ్ఞుడికీ అంతుపట్టని ధనాకర్షణ సిద్ధాంతం
జనాకర్షణ మర్మమెరుగని ఓటర్లుమటుకు
ఎటూ వెళ్ళలేక నిస్సహాయులవుతున్నారు

---

# నిర్బంధ ఆధారం

- సయ్యద్ జహీర్ అహ్మద్
9505152560



గాలిపటానికి గాలి ఎంత ఆధరువో
గాలిలో దీపానికి అరచేతులు అంత ఆధారం
ప్రాణి కోటికి ప్రాణవాయువు ఎంత అవసరమో
మనిషి బ్రతుక్కి గుర్తింపు అత్యవసరం కాదేమో!

కుక్కలు మొరుగుతాయి విశ్వాసంగా
నక్కలు ఎత్తులు వేస్తాయి జిత్తులుగా
రాచిలుకలు పలుకుతాయి అద్భుతంగా
రాబందులు పీక్కు తింటాయి అమానుషంగా
కోయిలలు ఆలపిస్తాయి కలకలంగా
స్వేచ్ఛను హరించే మంత్రం ఇక్కడ పారదు

వలువలు కట్టుకొని పుట్టుక లేదు
గిట్టుక మునుపే వలువలు వీడలేదు
ఈ దేశపౌరునికి స్వేచ్ఛగ మసలే వీలులేదు
జననం మొదలు మరణం దాక
ధృవపత్రాల దాఖలు
అన్నీ కారాచరణ రూపకల్పనకే
విద్యాసంస్థల కార్డునుంచి మొదలైన ప్రహసనం
రేషన్‌కార్డులో నమోదైతే బుక్కెడు మెతుకులు
ఓటర్‌కార్డుతో ఎన్నుకుంటే గుర్తింపుపాలకులు
ఏ రాయి అయితేనేమి పళ్ళూడగొట్టడానికి
పులి చర్మం కప్పుకొని కరితొండం పెట్టుకొని
'నందన్ నిలేకని' ఉపదేశించిన క్రానికల్ డిజార్డర్
శేషాచలంలో రగిలిన దావానలంలా
అనుసంధానింపబడుతుంది ఆధార్‌కార్డు
విద్యాబుద్ధులకు వైద్యోగేతరబద్ధులకు
జలవిద్యుత్ వినియోగాలకు
బ్యాంకు ఖాతాలకు గ్యాస్‌బండలకు
ఇంధన వాహనాలకు నిమ్ కార్డులకు
కార్మిక కర్షక ఉపాధివేతనాలకు
భూమి భాటకాలకు
పల్లేరు మీది నడక నెమ్మదిగా....
ప్రజాస్వామ్యదేశంలో
ప్రజాస్వేచ్ఛ దిగ్బంధనం.
పేవ్‌మెంటును పర్చుకున్న
యాచకుణ్ణి
రాతిని ఆయుధం చేసి
గస్తీ చేసే ఉన్మాదిని
ఐరిష్‌తో బంధించి
ఆధార్ నమోదు చేయగలరా?



**ఆటవిడుపు** కథల సంపుటి

**దాసరి శివకుమారి**

వెల : ఉచితం పేజీలు: 120

ప్రతులకు : 9986067664

దాసరి శివకుమారి కథల్లో ఇతివృత్తాల్లో వైవిధ్యం, పాత్రచిత్రణలో నైపుణ్యం, సన్నివేశ కల్పనలో చాతుర్యం, వాటి దీర్ఘమైన వర్ణనలు, సంభాషణా నైపుణ్యాలు కనిపిస్తాయి. సాహిత్యపు విలువలతో పాటు సామాజిక విషయాల పట్ల అవగాహన, సమస్యల పరిష్కరణ మార్గాలు ద్యోతకమవుతాయి. .

**- నాగబైరవ ఆదినారాయణ**



ప్రత్యామ్నాయ చరిత్ర

**దళితుల సామాజిక సాంస్కృతిక చరిత్ర**

**డా॥ కత్తి పద్మారావు**

వెల : 250/- పేజీలు: 255

ప్రతులకు : 9849741695

ఈ పుస్తకం దళితులు ఈ దేశ నిర్మాతలుగా, ఈ సంస్కృతీ నిర్మాతలుగా తమను తాము నిలబెట్టుకోవడానికి, నిరూపించుకోవడానికి ప్రామాణిక గ్రంథం అవుతుంది. ఈ గ్రంథ రచన కోసం అనేక గ్రంథాలు పరిశోధించడం జరిగింది. ప్రతి విషయాన్ని ప్రామాణిక గ్రంథాల నుంచే ఇందులో ఉదాహరణ ఇచ్చాను.

**డా॥ కత్తి పద్మారావు**



**దోసెడు పల్లీలు** మరికొన్ని కథలు

**ఉదయమిత్ర**

వెల : 120/- పేజీలు: 175

ప్రతులకు : 9985203376

ఈ కథల నిండా శ్రామిక కులాలైన దళితులు, బహుజనులు చెప్పుకునే నోటి కథల శిల్పం - సరళత, క్లుప్తత, చార్లిచాప్లిన్ సినిమాల్లోని వ్యంగోత్మకమైన హాస్యం, అంతర్లీనంగా "గాలిసోకిన మనిషి" లాగా కథల నిండా ఆసులో దారంలా తిరిగే రచయిత - ఈ కథల ప్రత్యేకత.

**- అల్లం రాజయ్య**



**మత కౌగిలి**

**వచన కవితా సంకలనం**

**నెమలి చంద్రశేఖర్**

వెల : 60/- పేజీలు: 126

నెమలి చంద్రశేఖర్ కవితల్ని చదువుతున్నప్పుడు సి.వి. కవిత్వం గుర్తుకొచ్చింది. సి.వి. కవిత్వం చదువుతున్నప్పుడు పాఠకునిలో కలిగే తాదాత్మికత చంద్రశేఖర్ కవితల్లో వుండడం గమనిస్తాం. కులమతాంశాలను బోనులో నిలబెట్టి పాఠకుల తరపున వాదించే తత్వం వీరిద్దరి కవితల్లోనూ వుంది. ఇదొక వినూత్న ప్రక్రియ. దీన్ని 'వాదనా కవిత' అని, ఇంగ్లీషులో 'ఆర్గ్యుమెంట్ పొయెట్రీ' అని అనవచ్చు.

**- బి. సాంబశివరావు**



**స్వప్న సాధకులు**

**విద్యార్థుల కవిత్వం**

**సంపాదకత్వం: బాలసుధాకర్ మౌళి**

వెల : 100/- పేజీలు: 80

ప్రతులకు : 9676493680

అలాగే బాలసుధాకర్ మౌళి తన శిష్యుల ప్రోత్సహించి, కవిత్వం వినిపించి, కవిత్వం రాయించి, మంచిచెడులు చెబుతూ వాళ్ళని తీర్చిదిద్దటమే కాకుండా, ఒక 8 మంది విద్యార్థుల కవిత్వాన్ని పుస్తకంగా తేవాలని నిర్ణయించాడు. తెస్తున్నాడు. ఈ ఎనిమిది మందిలో - ఎవరికి తెలుసు? రేపు ఎవడన్నా మహాకవి కావచ్చు.

**- శివారెడ్డి**



**కాగుతున్న రుతువు**

**కె. క్యూబ్‌వర్మ**

వెల : 80 పేజీలు: 175

ప్రతులకు : 9493436277

ఈ పద్యాల్లో గొప్ప సౌందర్యముంది; 'భయద సౌందర్యముంది'. కళ్ల నీళ్లగుండా లోకాన్ని చూడటముంది. ఇంటా బయటా ఆవరించి వున్న యుద్ధరంగంలో నడుస్తూ రాసిన కవితలివి.

**- శివారెడ్డి**

## సోమేపల్లి పురస్కార కథలు 2




**సంకలనం: సోమేపల్లి వెంకటసుబ్బయ్య**

**చలపాక ప్రకాష్**

వెల : 100 పేజీలు: 184

ప్రతులకు : 9247475975

ప్రతి 4 ఏళ్ళకోసారి ఈ బహుమతి కథలతో 'సోమేపల్లి పురస్కార కథలు' పేరుతో కథల సంకలనం తీసుకువచ్చి, తెలుగు సాహిత్యరంగంలో ఈ కథలకు శాశ్వతత్వం కలగజేయడం, ఒక రకంగా కథలకు హీరో ఇమేజ్ కలుగజేయడం, తద్వారా ఆ కథకులు ఉత్సాహంతో రచయితలు మరిన్ని మంచి కథలు రాసి సమాజమార్పుకు దోహదపడే విధంగా తయారు చెయ్యడం... ఇవీ మా లక్ష్యాలలో భాగాలు.

**- సంకలనకర్తలు**

## అంకురం




**బౌద్ధ వ్యాసాల సమాహారం**

**బొర్రా గోవర్ధన్**

వెల : 80/- పేజీలు: 112

ప్రతులకు : 9848199098

ఈ పుస్తకం అనేక పత్రికల్లో వచ్చిన వ్యాసాల సమాహారం. బౌద్ధ పత్రికల్లో కాకుండా ఇతర పత్రికల్లో కూడా బౌద్ధం గురించి రాసే అవకాశం ఆయా పత్రికల వాళ్ళు ఇచ్చారు. ఈ వ్యాసాల గురించి చెప్పటం కంటే వారందరికీ మప్పిదాలు (కృతజ్ఞతలు) చెప్పటమే ఇక్కడ నా వంతు.

**- బొర్రా గోవర్ధన్**

## ఇసిత్రం



**తెలంగాణ మాండలిక కవితలు**

**పంచరెడ్డి లక్ష్మణ**

వెల : 50/- పేజీలు: 64

ప్రతులకు : 9440007101

ఇసిత్రం' కవితలు రాశాకా నిజంగా లోకంలో పుట్టినట్టయింది. విద్యుత్‌శాఖలో నా ఉద్యోగం. విద్యుత్ శాఖా విద్వత్తు నా 'ఇసిత్రం' కవితల్లో ప్రసారమయినది. 1973లో ప్రచురితం అయిన 'ఇసిత్రం' తెలంగాణ ఉద్యమంలో అందరి దృష్టికి వచ్చి, పునర్ ముద్రణ గూర్చి మిత్రులు ప్రస్తావించారు.

**- రచయిత**

## విశ్రాంతి కావాలి కథల సంపుటి



**బొందల నాగేశ్వరరావు**

వెల : 120/- పేజీలు: 108

ఈ సంపుటిలో కథలన్నీ మన చుట్టూ మసలే సాధారణ మనుషుల్ని గురించీ, వారి చిత్తవృత్తుల్ని గురించీ, వారి ప్రవర్తన గురించీ, వారి వారి స్వభావాల్లోని వైచిత్రి గురించీ చెబుతాయి. ఆ క్రమంలో ఈనాటి సమాజం పోకడనీ మన ముందుంచుతాయి. అన్ని కథల్నీ మీరుగా చదవండి. నా అభిప్రాయంతో ఏకీభవిస్తారు.

**- విహారి**

## అఖిలాశ కవిత్వం




**జానిబాషా చరణ్ తక్కెడశిల**

వెల : 50/- పేజీలు: 111

ప్రతులకు : 7259511956

అజ్ఞాత శక్తిని వర్ణించినా, ఏలికకు హితవు చెప్పినా, 'ఇంగిలిపీసు కులుకు పలుకులు ఏలనయ్యా' అంటూ తెలుగువాడిని ప్రశ్నించినా, వెళ్తున్నానంటూ టాటా చెప్పినా, సంక్రాంతి సంబరాలను కన్నుల ముందు నిలిపినా అఖిలాశదే ప్రత్యేకమైన శైలి, చివరగా సమాధి అంటే కొత్త నిర్వచనం చెప్తూ ఈ కవితాఝురికి ఆనకట్ట వేస్తాడు. పాఠకులకి మంచి కవితలు చదివామన్న తృప్తి లభిస్తుంది.

**- డా॥ మంథా భానుమతి**

## జీవన తరంగాలు




**సి. వెంకటకృష్ణ, డాక్టర్ కె. బాబురావు**

వెల : 150 పేజీలు: 120

ప్రతులకు : 9849066789

'విశిష్టవ్యక్తిత్వం'లో షష్టి పూర్తి ఉత్సవం వరకు సివిఆర్ గారి జీవిత విశేషాలు ప్రకటితమయ్యాయి. ఇంకా పదేళ్ళు గడవలేదు. కానీ, ఈ దశాబ్దం ఆసక్తికరమైన సంఘటనల, విశిష్ట సన్నివేశాల సముచ్చయం. వాటినుంచి కొన్ని ప్రబోధాత్మకాలైన జ్ఞాపకాలు, అనుభవాలు, చిరుగాథలను సమీకరించి సమర్పిస్తున్నాను.

**- సి. వెంకటకృష్ణ**

## వెన్నెల బువ్వ

- టి.వైష్ణవి శ్రీ
8977237345



ఆకాశంలోకి తొంగి చూసిన ప్రతి సారీ
అనుకుంటాను
నక్షత్రాలు ఆకాశాన్ని మోస్తున్నాయా
ఆకాశమే నక్షత్రాలను కాపు కాస్తుందా అని..!!

ఉగ్గు గిన్నెలోకి
తొంగి చూస్తున్న చందమామ
భలే నవ్వుతుంది
పసిపాప బుగ్గలో
సొట్టలా ఉక్కిరి బిక్కిరై!!

నక్షత్రాలు తనకి తోడున్నాయని
చెప్పకనే చెబుతుంది ఆ నవ్వు
చంద్రుడి నవ్వులను మోస్తున్న నక్షత్రాలకు చక్కిలిగింత
పెట్టినట్లుంది ..!!

ఉగ్గు గిన్నెలో చందమామను చూస్తూ
అమ్మ పెట్టే వెన్నెల బువ్వను
నక్షత్రాలు చేసుకుంటాడు పసివాడు
ఆకాశమంత కళ్ళను మోస్తూ..!!

---

## ఘోష

- బిరుసు సురేష్‌బాబు
7569480800



ఒసేయ్ పింకు మొహమా...!
హుందాగా దర్జాగా తిరిగిన నన్ను
రంగు రంగుల వయ్యారాలతో
నా వాళ్ళకు దూరం చేశావ్

ఇన్నాళ్ళు నాకు జైకొట్టిన వాళ్లే
ఇప్పుడు ఛీ... కొడుతున్నారు
ఇంతకాలం నా కోసం ఎగబడ్డ వాళ్ళే
నన్ను వదిలించుకోటానికి క్యూ కడుతున్నారు

ఎందుకొచ్చావే నువ్వు
ఎందుకే ఆ వికటాట్టహాసం

కూతురి పెళ్లికోసం
నాతో ముచ్చటిస్తున్న
ముసలిదాని ఊపిరి తీశావ్ కదే...!
బ్యాంకులో నిలబడ్డమే చికాకైన నా భక్తుడిని
రోడ్డుమీదకు ఈడ్చావు కదే...!
అప్పుడప్పుడు ఎ.టి.యం లలో
నా మిత్రున్ని కలిశాననే నెపంతో
మా స్నేహాన్ని ద్వేషం చేశావ్ కదే....!
నన్ను బలవంతంగా హత్యచేసి
నా ప్రియుడితో కులకాలనేనా నీ కుట్ర?

నన్ను దాచేసినోన్ని పట్టుకొమ్మని హింసిస్తే
నన్నే లేకుండా చేశావ్ కదే... దగాకోర్
అవినీతికి అత్త కొడుకైనా
వాడి మనసు మార్చమంటే
ఇదేంటే...!?
నన్నే మాడ్చి మసి చేశావ్...

దేశంలో మానేసి
ఈ నోటుపై యేందే నీ స్వచ్ఛభారత్
చిరిగిపోయిన ఐదు రూపాయల ఫేసూ... నువ్వు

చేయని నేరంతో
అంటరాని శిక్ష అనుభవిస్తున్న దళితుల్లా
నాకు ఈ వెలివేతల దుఃఖమేంటే...!?

# ప్రయోగాత్మక దిశలో రాయలసీమ కథ



రాయలసీమ కథ ప్రయోగాత్మక దిశలో సాగుతోందని ప్రముఖ రచయిత బండి నారాయణ స్వామి అన్నారు. కర్నూలులో జూలై 8, 9 తేదీలలో జరిగిన విరసం కథల వర్క్ షాప్‌లో ఆయన రాయలసీమ కథపై తన అనుభవాలను పంచుకున్నారు. గతంలో రాయలసీమ బాధల గురించి రాసేవారని, ఇప్పుడు ఎదురుతిరిగే ధోరణిలో రచనలు వస్తున్నాయని ఇది శుభ పరిణామమని అన్నారు. అలిగోరి, మాంత్రిక వాస్తవం మొదలైన ప్రక్రియల్లో రాయలసీమకు జరిగే అన్యాయాలపై కథకులు రాస్తున్నారని ఆయన అన్నారు. అరవై ఏళ్ళ వయసులో ఉప్పలపాటి వెంకటేశ్వర్లు రాసిన కథను ఆయన ఉదహరించారు. నది ఆత్మహత్య మొదలైన కథల్లో వస్తువుగురించి వివరించారు. సాధారణ రచనా సూత్రాన్నుండి రచయితలు బయటపడాలని, శిల్పధోరణులు మారి నూతన కళాసృష్టి జరగాలని అన్నారు. ప్రయోగాత్మత అనివార్యమన్నారు. కొత్త పరిస్థితులకు సంబంధించి కొత్త విషయాలు రావలసిన అవసరాన్ని ఆయన నొక్కి చెప్పారు.

ఉదయం జరిగిన ప్రారంభ సభలో పాణి వర్తమాన రాయలసీమ సందర్భం అన్న అంశాన్ని, దాని నేపథ్యాన్ని వివరించారు. సాహిత్య అకాడెమీ యువపురస్కార గ్రహీత, కవి అప్పిరెడ్డి హరినాథరెడ్డి మాట్లాడుతూ రాయలసీమ కథకుల్లో సామాజిక స్పృహతోపాటు సమకాలీన సమస్యల్ని రాయవలసిన ఆవశ్యకత ఉందన్నారు. సీమవాసులను కరువు కలుపుతోందన్నారు. మన నాయకులే మనల్ని మోసం చేస్తున్నారన్నారు. రాయలసీమలో తాగు, సాగు నీటి సమస్య, కరువు, విద్యాలయాలు మొదలైన అంశాలపై ప్రజాసంఘాలు పనిచేయాలన్నారు. రాష్ట్ర విభజనకు ముందు సీమాంధ్ర అన్నవారు ఆంధ్రకు మాత్రమే న్యాయం చేస్తున్నారని, సీమను మరచిపోయారని అన్నారు. ఈ సమయంలో కథా రచయితలు, కవులు మౌనం వహించరాదని అన్నారు. విభజన చట్టంలో ఉన్న లొసుగులను సరిచేయాలన్నారు. తరువాత జరిగిన చర్చలో రచయితలు అజీజ్, అరుణ్‌కుమార్, అల్లం రాజయ్య మొదలైన వారు పాల్గొన్నారు. అల్లం రాజయ్య మాట్లాడుతూ ఉత్పత్తి సాధనాలు, శక్తులపై దృష్టి పెట్టాలని అవి ఎవరిచేతిలో ఉంటే వారే బాగుపడతారన్నారు. తెలంగాణ అనుభవాలనుండి కూడా రాయలసీమ వాసులు కొన్ని పాఠాలు నేర్చుకోవాలన్నారు. ఉద్యమాలలోకి మేధావులు, కవులు, రచయితలు రావాలన్నారు. పోరాటాలకు రచయితలు వెన్నుదన్నుగా ఉండాలని కోరారు. రాయలసీమ పోరాటాల్లో చిత్తూరు జిల్లానుండి ప్రాతినిధ్యం తక్కువగా ఉందని కొందరు అభిప్రాయపడ్డారు.

మొదటిరోజు జరిగిన సదస్సులో విరసం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వరలక్ష్మి, రచయితలు జంధ్యాల రఘుబాబు, అజీజ్, వెంకటకృష్ణ, ఇనయతుల్లా, సుభాషిణి, ఉమామహేశ్వర్ తెలకపల్లి మధుశర్మ, వెంకటేష్, కల్యాణదుర్గం స్వర్ణలత మొదలైన వారు పాల్గొన్నారు. రాయలసీమనుండే కాక తెలంగాణనుండి కూడా యువ కథా రచయితలు ఈ సదస్సుకు హాజరయ్యారు. రెండవ రోజు రచయితలు తమ కథానికలు చదివారు. వాటిపై జరిగిన చర్చలో అల్లం రాజయ్య, బండి నారాయణ స్వామి, పాణి, వరలక్ష్మి పాల్గొని విశ్లేషణలు చేశారు. రాయలసీమ వెనుకబాటు తనం, కరువు మొదలైన అంశాలతో కథలు రాయాలన్నారు.

**- జంధ్యాల రఘుబాబు**



సాహితీస్రవంతి ఆధ్వర్యంలో అనంతపురంలో ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో ఆగస్టు 23న జరిగిన సాహిత్య గోష్ఠిలో కవితల పోటీలో బహుమతులు ప్రదానం చేస్తున్న దృశ్యం. చిత్రంలో పిళ్ళా కుమారస్వామి, శంకర నారాయణరాజు, రాజశేఖర్, సుధాకర్ తదితరులు

అనంతపురంలో ఆగస్టు 23న ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో సాహిత్య గోష్ఠి జరిగింది. ఈ సమావేశంలో జూపల్లి ప్రేమ్‌చంద్ రాసిన 'ఆవేద' కావ్యాన్ని పిళ్ళా కుమారస్వామి విశ్లేషించారు. మనువాదాన్ని కాలదన్నేందుకు, అణగారిన కులాలు ఐక్యతా రాగం పలకాలని 'ఆవేద' కావ్యం ఆకాంక్షించిందని అన్నారు. జూపల్లి ప్రేమ్‌చంద్ 'నిచ్చెనమెట్ల లోలకం' కావ్యంపై శంకరనారాయణ రాజు మాట్లాడారు. అనంతరం కవితల పోటీ జరిగింది. ఈ కార్యక్రమంలో రమణ, యాకూబ్‌ఖాన్, వై.సి.పి.వెంకటరెడ్డి, నరసింహులు, కృష్ణమూర్తి, రాజు, నగేష్, చెన్నక్రిష్ణ, విజయ్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.




విజయనగరంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూలై 24న జరిగిన జాషువా వర్ధంతి సభ. చిత్రంలో సాహితీస్రవంతి విజయనగరం జిల్లా అధ్యక్ష కార్యదర్శులు పి.ఎస్. శ్రీనివాసరావు, పాయల మురళీకృష్ణ. ఇనుగంటి జానకి, ప్రీతి



హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో అనంతోజు మోహనకృష్ణ కవితా సంపుటి 'ఆలోచన చేద్దామా?' ఆవిష్కరణ సభ. చిత్రంలో నవ తెలంగాణ దినపత్రిక సంపాదకులు ఎస్. వీరయ్య, సుధామ, కె. ఆనందాచారి, అనంతోజు మోహన కృష్ణ, జి. యాదగిరి రావు, కొండేపూడి నిర్మల, నరేష్, తంగిరా చక్రవర్తి, రమేష్, భూపతి వెంకటేశ్వర్లు తదితరులు




అనంతపురం జిల్లా కదిరిలో బ్లూమూన్ డిఎడ్ కళాశాలలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూలై 24న జరిగిన జాషువా వర్ధంతి సభ. చిత్రంలో సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు పి. కుమారస్వామి , కళాశాల ప్రిన్సిపాల్ రమణ, అధ్యాపకులు రియాజ్



అనంతపురంలో సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూలై 24న ప్రభుత్వమహిళా కళాశాలలో జరిగిన జాషువా వర్ధంతి సభ. చిత్రంలో ప్రముఖ విమర్శకులు డా॥ రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, కళాశాల ప్రిన్సిపాల్ కళ్యాణి, వై. సూర్యనారాయణ రెడ్డి,

## సాంఘిక ఉద్యమాన్ని నిర్మించిన జాషువా

**- దళితులపై వివక్ష, దౌర్జన్యాలపై 'జనకవనం'**



ఆంధ్రప్రదేశ్‌లో గుర్రం జాషువా సాహిత్యం సాంఘిక ఉద్యమాన్ని నిర్మించిందని ప్రముఖ రచయిత్రి, నాగార్జున విశ్వవిద్యాలయం ప్రొఫెసర్ చల్లపల్లి స్వరూపరాణి అన్నారు. జాషువా రచనలు అందరికీ అర్థమయ్యేలా ఉండేవని, ఆయన పద్యాలు ప్రజల నాలుకపై నర్తించాయన్నారు. జాషువా సాంస్కృతిక వేదిక, సాహితీ స్రవంతి సంయుక్తాధ్వర్యంలో గుర్రం జాషువా 46వ వర్ధంతి సభ విజయవాడలోని ఎంబి విజ్ఞాన కేంద్రంలో ఆగస్టు 24న జరిగింది. సాహితీ స్రవంతి అధ్యక్షులు వొరప్రసాద్ అధ్యక్షతన 'జాషువా సాహిత్యం-వర్తమానం' అనే అంశంపై ప్రధాన వక్త స్వరూపరాణి మాట్లాడుతూ పేదరికం సహనాన్ని నేర్పితే, కులతత్వం తిరగబడే తత్వాన్ని నేర్పిందని, ఈ రెండూ తన గురువులని జాషువా చెప్పుకున్నారన్నారు. జాషువా కవిత్వం ప్రస్తుత పరిస్థితుల్లో చాలా అవసరమని జాషువా సాంస్కృతిక వేదిక కన్వీనర్ కవి పిఎన్‌ఎం అన్నారు. అనంతరం పశ్చిమ గోదావరి జిల్లా గరగపర్రు, క ృష్ణా జిల్లా అగిరిపల్లి, ఒంగోలు జిల్లా దేవరపల్లి, చిత్తూరు జిల్లా మహాభారతం ఉత్సవంలో దళితులపై వివక్ష, దౌర్జాన్యాలకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలకు సంఘీభావంగా కట్టా సిద్దార్థ ఆధ్వర్యంలో జనకవనం జరిగింది. ◆

## సాహితీస్రవంతి అనంతపురం జిల్లా నూతన కమిటీ



సాహితీస్రవంతి నిర్వహించిన జిల్లా వార్షికోత్సవ సభలో సభ్యులందరూ కలిసి నూతన జిల్లా కమిటీని ఎన్నుకున్నారు. ఈ సభ అనంతపురంలోని ఎన్‌జివో హోమ్ పెన్షనర్ల భవనంలో జరిగింది. సాహితీస్రవంతి జిల్లా గౌరవ అధ్యక్షులుగా పిళ్ళా కుమారస్వామి, అధ్యక్షురాలిగా క్రిష్ణవేణి, ప్రధాన కార్యదర్శిగా చెన్నా రామమూర్తి, కోశాధికారిగా అశ్వర్థ రెడ్డి, సహాయ కార్యదర్శులుగా టి. నాగేంద్ర, నాగశేషు (హిందూపురం), సత్యనిర్ధారణ్ (ధర్మవరం), ఉపాధ్యక్షులుగా రవిచంద్ర, ఆవుల వెంకటేశులు, అశ్వనారాయణ (హిందూపురం), శారద (ధర్మవరం), శివకుమార్ (రాయదుర్గం), కృష్ణ ప్రసాద్ (గోరంట్ల), రామప్రసాదు, నానీల నాగేంద్ర, శంకర నారాయణ రాజు (కదిరి), హిదయతుల్లా, బాలభారతమ్మ, ఆదిమూర్తి (ధర్మవరం) లను ఎన్నుకున్నారు. ఎన్నిక అనంతరం అధ్యక్షులు క్రిష్ణవేణి మాట్లాడుతూ జిల్లాలో సాహిత్య వికాసం కోసం, కొత్త తరం రచయితలు, కవుల కోసం సాహిత్య కార్యక్రమాలను రూపొందించి నిర్వహిస్తామన్నారు. ప్రధాన కార్యదర్శి చెన్నా రామమూర్తి మాట్లాడుతూ జిల్లాలో సాహిత్య రంగంలో ప్రసిద్ధి చెందిన కవుల రచయితల సేవలను ఉపయోగించుకుని సాహితీస్రవంతి కార్యక్రమాలను విస్తృతం చేస్తామన్నారు. ఎన్నుకున్న సభ్యులకు ధన్యవాదాలు తెలిపారు.

## సాహితీస్రవంతి అనంతపురం నగర కమిటీ

సాహితీస్రవంతి అనంతపురం నగర కమిటీని జూలై 2న అనంతపురంలో సాహితీస్రవంతి కార్యాలయంలో ఏకగ్రీవంగా ఎన్నుకున్నట్టు సాహితీస్రవంతి జిల్లా అధ్యక్షులు క్రిష్ణవేణి, ప్రధాన కార్యదర్శి చెన్నా రామమూర్తి ఒక ప్రకటనలో తెలిపారు. అనంతపురం నగర గౌరవ అధ్యక్షులుగా వై. సూర్యనారాయణ రెడ్డి, అధ్యక్షులుగా డా॥ రసూల్, ప్రధాన కార్యదర్శిగా సుధాకర్, కోశాధికారిగా రామప్రసాదు, సహాయ



కార్యదర్శులుగా హిదయ్‌తుల్లా, వెంకటరమణ, ఉపాధ్యక్షులుగా ఎం. ప్రగతి, బాల భారతమ్మ, కార్యనిర్వాహక సభ్యులుగా మిద్దె మురళీకృష్ణ, మధురశ్రీ, జూటూరు షరీఫ్, నానీల నాగేంద్ర, యమున, యమునా రాణి, జెన్నే ఆనంద్‌కుమార్, రియాజుద్దీన్, ముకుందాపురం పెద్దన్నలను సభ్యులు ఏకగ్రీవంగా ఎన్నుకున్నట్టు తెలియజేశారు. నగరంలో పాఠశాల, కళాశాల విద్యార్థినీ విద్యార్థుల్లో కథ, కవితా ప్రక్రియలలో వర్క్‌షాపులు నిర్వహించి సాహిత్య అభిలాషను పెంచడానికి, ఔత్సాహిక రచయితలను ప్రోత్సహించడానికి కృషి చేస్తామని నూతన కమిటీ ప్రకటించింది.

## సాహితీస్రవంతి విజయనగరం జిల్లా నూతన కార్యవర్గం

సాహితీస్రవంతి విజయనగరం జిల్లా నూతన కార్యవర్గాన్ని జూలై 16న జరిగిన సమావేశంలో ఎన్నుకున్నారు. తెలుగు భాష, సాహిత్యంపై ప్రజల్లో ఆసక్తి పెంచడం, అభ్యుదయ సాహిత్యం ద్వారా మానవ విలువల ప్రచారం, కవులకు, రచయితలకు వేదికలు కల్పించడం, వర్ధమాన రచయితలకు శిక్షణ, అవకాశం కల్పించడం అనే లక్ష్యాలతో సాహితీస్రవంతి కృషి చేస్తుందని కార్యవర్గాన్ని ప్రకటిస్తూ నూతన అధ్యక్షులు పి.ఎస్. శ్రీనివాసరావు అన్నారు. గౌరవ సలహాదారుగా ప్రముఖ సాహితీవేత్త గంటేడ గౌరునాయుడు, గౌరవ అధ్యక్షులు చీకటి దివాకర్, అధ్యక్షులు పి.ఎస్. శ్రీనివాసరావు, ప్రధాన



కార్యదర్శి పాయలమురళీకృష్ణ, ఉపాధ్యక్షులు ఇనుగంటి జానకి, పి. మహేష్, చెళ్ళపిళ్ళ శ్యామల, సహ కార్యదర్శి దాసరి తిరుపతి రావు, ఇల్ల ప్రసన్న లక్ష్మి, కాకర్ల గాంధీ, కోశాధికారి బి. హైమావతి, ఆర్గనైజింగ్ కార్యదర్శి చీకటి చంద్రికా రాణి, 15 మంది క్రియాశీల సభ్యులుగా ఎన్నికయ్యారు.

## విమలాశాంతి పురస్కారాలకు రచనల ఆహ్వానం

2017-శాంతి రజనీకాంత్ స్మారక కథా పురస్కారం కోసం కథా సంపుటాలను ఆహ్వానిస్తున్నట్టు డా॥ శాంతి నారాయణ ఒక ప్రకటనలో తెలిపారు. ఈ పురస్కారాలను ప్రతీ సంవత్సరం అందజేస్తున్నట్లు పేర్కొంటూ, ఒక సంవత్సరం కవితకు, ఒక సంవత్సరం కథకు ఇస్తున్నామని తెలిపారు. ఈ సంవత్సరం కథకు అందజేస్తున్నామని, ఈ పురస్కారం కోసం జనవరి 2013 - డిసెంబరు 2016 మధ్య కాలంలో ప్రచురించిన కథా సంపుటాలను మాత్రమే పరిశీలించడం జరుగుతుందని తెలిపారు. రచయితలు తమ కథా సంపుటాలు నాలుగు కాపీలను పంపుతూ మూడు కాపీల మీద 'విమలా శాంతి సాహిత్య పురస్కారం కోసం' అని తప్పని సరిగా రాసి పంపాలని కోరారు. ఆగస్టు 15వ తేదీలోపు వి. వెంకటేశులు, కథా రచయిత (రిటైర్డ్ ఫారెస్ట్ రేంజరు), డోర్ నెం. 3-328, ఎస్.ఎస్.ఎస్. సూపర్ మార్కెట్ దగ్గర, తపోవనం, అనంతపురం అనే చిరునామాకు పంపించవలసిందిగా ఆ ప్రకటనలో కోరారు.

## పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు సమగ్ర జీవిత చరిత్ర రచనకు తోడ్పడండి!

పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు సమగ్ర జీవిత చరిత్ర రచనకు ఉపక్రమించామని, వారితో పరిచయమున్న వ్యక్తులు, పెద్దలు - వారి జీవిత విశేషాలు, రాజకీయ విశేషాలు, వారు పాల్గొన్న ఉద్యమాలు, చేసిన పోరాటాలు, జైలు జీవితం, జాతీయ నాయకులతో ఉన్న సంబంధాలు, ఆయన చేసిన ఉపన్యాసాలు, జాతీయోద్యమంలో తిరిగిన ప్రాంతాలు, కలిసిన ప్రముఖులు, అప్పటి ఆయన అనుచరుల సమాచారాలు, ఆయన చేసిన సంగీత, సాహిత్య, శిల్పకళా పోషణ, ప్రచురించిన పుస్తకాలు తదితర చిన్నా పెద్దా సమాచారాన్ని తెలియజేయవలసిందిగా 'పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు స్మారక సేవాసమితి అధ్యక్షులు హెచ్. నాగరాజారావు ఒక ప్రకటనలో కోరారు. 2017 డిసెంబరు నెలలో జరిగే కల్లూరి వారి వర్ధంతికి ఈ పుస్తకం విడుదల చేయాలని భావిస్తున్నట్లు తెలిపారు. సమాచారాన్ని హెచ్. నాగరాజారావు, రిటైర్డ్ ప్రిన్సిపాల్, డోర్ నెం. 5-5-15, బాలాజీ విద్యావిహార్ ఎదురుగా, నానెప్పనగర్, హిందూపురం - 515 201 కు పంపించవచ్చును. వివరాలకు 09849266112 (వాట్సప్) ద్వారా సంప్రదించవచ్చును.

## అనంతపురంలో సాహితీస్రవంతి కార్యశాల

ఒకవైపు సాంకేతిక పరిజ్ఞానం అత్యంత వేగంగా వృద్ధి చెందుతుంటే సామాజికంగా చాంధస భావాలు రాజ్యమేలుతున్నాయని సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు వొరప్రసాద్ అన్నారు. ప్రజలలో సాంఘిక చైతన్యం పెంచడానికి, మానవతా భావాలు వ్యాప్తి చేయడానికి రచయితలు తమ వంతు కర్తవ్యం నిర్వహించాల్సి ఉందని ఆయన అన్నారు. అనంతపురంలో జూలై 2న జరిగిన సాహితీస్రవంతి కార్యశాలలో ఆయన పాల్గొని మాట్లాడారు. అనంతపురం జిల్లా సాహితీస్రవంతి గౌరవ అధ్యక్షులు పిల్లా కుమారస్వామి మాట్లాడుతూ సాహిత్యం కాలనుగుణంగా మారుతుందని, ప్రస్తుతం కవులు, రచయితలు ప్రపంచీకరణ విసురుతున్న సవాళ్ళకు స్పందించి రచనలు చేయాలని అన్నారు. అనంతరం కథా సాహిత్య పరిణామంపై ప్రముఖ విమర్శకులు రాచపాళెం చంద్రశేఖర రెడ్డి ప్రసంగించారు. ఆయన మాట్లాడుతూ సాహిత్యానికి పుట్టుక సమాజమేనని,




సమాజాన్ని వదిలిపెట్టి రాసే రచనలకు ప్రజల్లో గుర్తింపు లేదన్నారు. ప్రపంచవ్యాప్తంగా వచ్చిన అనేక మార్పులు సాహిత్యాన్ని ప్రభావితం చేశాయన్నారు. రచయితలు సమాజ గమనాన్ని అర్థం చేసుకొని ప్రజల కోసం రచనలు చేయాలని కోరారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి ప్రధాన కార్యదర్శి రవిచంద్ర, అధ్యక్షురాలు ప్రగతి, కథా రచయిత చెన్నా రామమూర్తి, మధురశ్రీ, శారద, సత్యనిర్ధారణ్, నారాయణ, కొండారెడ్డి, నాగేంద్ర, మురళీకృష్ణ, బాల భారతమ్మ తదితరులు పాల్గొన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/16-18
Date of Posting : 02.08.2017 ▪ Date of Publication: 27.07.2017



# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు

## వేమన సాహిత్యంపై 14 ప్రామాణిక గ్రంథాలు













































ప్రస్థానం పాఠకులకు ప్రత్యేక తగ్గింపు

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్ 27-1-64, కారల్‌మార్క్స్‌రోడ్, విజయవాడ. ఫోన్: 0866-2577533

52

If Un delivered please return to: Prasthanam, C/o M.H. Bhavan, Plot No. 21/1,
Near RTC Kalyana mandapam, Azamabad, Hyderabad - 500 020. Ph: 040- 27660013, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A183 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 23/5/24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Gayatri |
| పేజీలు విడదీసినది | Gayatri |
| స్కాన్ చేసినది | K Daveen |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |